# రాయబారము

[ కవిబ్రహ్మ ఉద్యోగపర్వము మాతృకగా గ్రహించి చేసిన వచనము ]




కర్త:

మొహమ్మద్ ఖాసింఖాన్, ఎమ్. ఏ.




ప్రకాశకులు:

లక్ష్మీ గ్రంథ ప్రచారిణి, తెనాలి.

 1942 [వెల రు 1-4-0

# తొలిపలుకు

భారత సాహిత్యమునందువలె ఆంధ్రవాఙ్మయమున మహాభారతము తలమానికము. కవిత్రయ రచితమగు ఆంధ్రమహాభారతమున తిక్కన కల్పన సాటిలేనిది. తిక్కన కవిబ్రహ్మ. తిక్కన తీర్పు తెనుగు తీపులు చిమ్మినది. తిక్కన తెలుగును రూపునకుఁ దెచ్చినాఁడు; దిద్ది తీర్చినాఁడు; అమృతము పోసినాఁడు; బ్రదుకు దెఱువేర్పఱిచినాఁడు. అందుచేతనే తెలుఁగుకు తిక్కన ఋణము తీర్చుకోఁజాలనిది.

కవితా చాతురియందు తిక్కన వ్యాసుని మించినాఁడు. "అందచందములఁ బాటింపని యడవి పడుచుంబోని వ్యాసుని రచనకు, తిక్కనకవి దగ్గఱకుఁ దీసి దిద్ది తీర్చి, ముద్దు ముచ్చటలం గూర్చి మాట నలుపులు నేర్పినాఁడు......ఆత్మ సంభూతమగు భారతసంతానమునందలి వివిధ వైలక్షణ్యాది చిత్తవృత్తులను చిత్రించినాఁడు వ్యాసభగవానుఁడు దానికి మెదిచి, మెఱుఁగులిచ్చినాఁడు తిక్కనకవి."

తిక్కన మహాకవి శైలి నిరలంకారము, నిరాడంబరము, నిగ్రహాబద్ధము; అతని శైలి నాటకీయము. అతఁడు చిత్రించిన పాత్రలు మన ఎదుట ప్రత్యక్షమగునట్లు చేయఁగల శక్తి తిక్కనది. పాత్రౌచిత్యము, సన్నివేశ రచనాచాతుర్యము, భావానుగుణ సంభాషణాక్రమ నిర్వహణమునందును తిక్కన యసమానుఁడు.

తిక్కన కృతమగు ప్రతి పర్వమందును ఈ కవితాశక్తి కన్పించుచున్నను ఉద్యోగపర్వమున నిది మిన్నందినది. ఉద్యోగపర్వమున భారతకథయందలి పాత్రలన్నియు తమ తమ చిత్తవృత్తులను ప్రదర్శించుచున్నవి. ఈ ప్రదర్శనమున పూర్వకళాకౌశలముతో తిక్కనమహాకవి నిర్వహించినాఁడు.

తిక్కన మహాకవియొక్క ఈ అద్భుత రచనను వచనమున జేసిన యెట్లుండునో యని శ్రీకృష్ణ రాయబారమున వర్ణితమైన ఉద్యోగపర్వ తృతీయాశ్వాసమును మొట్టమొదట వచనముఁ జేసి నా శ్రేయోభిలాషులగు సాహిత్యస్థాపక శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారికి జూపితిని. వారు తమ సహజౌదార్యముతో దాని నాదరించి నన్ను ప్రోత్సహించిరి. గురుసమానులయ్యు నన్ను మిత్రునిగ నాదరించు బ్రహ్మశ్రీ కురుగంటి సీతారామయ్యగారి ప్రోత్సాహమును దీనికి దోడైనది. వీరి యాదరము నూతగా గొని ఉద్యోగపర్వము నీ విధముగ వచనమున రచించి యాంధ్రలోకము నకు సమర్పించ సాహసించితిని. ఇందలి గుణములు తిక్కనమహాకవివి. దోసగులు నావి.

హైదరాబాదు,
1–7–42.

మొహమ్మద్ ఖాసింఖాన్.

నాలోచింపుఁడు. యుధిష్ఠిరుఁడు ధర్మువు దప్పి యయ్యింద్రపదవియైనఁ బడయ నోడఁబడఁడు. ఉచితగతి నెంత లభించినను నుల్లసిల్లును. కావునఁ బాండవులకుఁ బితృధనమగు రాజ్యము గపటద్యూతమున దుర్యోధనుఁ డపహరించుటయు, నది వీరు దిగ్విజయముఁ జేసి యలవరించుకొన్న పదమగుటయు, ధర్మసూను మహానుభావము విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినను నితఁడు వారలకుఁ గీడు సేయ రోయుటయు మీరెఱుఁగుదురు. కురురాజ్య మీ రెండు పక్షములవారికిఁ బంచి కుడువఁజనునదగుటచే మీరు తగిన కార్యము సెప్ప నర్హులు. నేనును నా కన్నంత చెప్పెద వినుఁడు."

కృష్ణ వాక్యములు

"కుంతీతనయులు శాంతతమై సమయము నడిపి, యిప్పుడు కోపోద్రిక్తులై తమ భుజాబలమును దుర్దాంతోద్యమశౌర్యమును నెఱిఁగింతు మనుచున్నారు. వీరి తలఁ పెఱిఁగిన గాంధారీతనయుఁడు బలము కొద్దిగనున్నపుడే వీరిని జయింపనగునని తలఁచి తన సుహృద్బాంధవులఁ గూర్చుకొనును.

అనంతములగు శత్రుసైన్యములను తగు బలము లేక యెంతటి బలవిక్రమోదాత్తులకైనను దోర్గర్వముమై గెలువ వశముకాదు గదా! కావునఁ బాండవపక్షపు భూవల్లభకోటి యిచటఁ బ్రోవై పాండవశత్రువులతోఁ బోరుదురు. ఇది యిక్కడి తెఱఁగునకుఁ దోఁచిన తలఁపు. అక్కడి వారి చిత్తవృత్తి యెట్టిదో మనమెఱుఁగము. ఎదిరిమత మెఱుఁగక యెట్టి కార్యమునైనను నిశ్చయింప

వెరవు కాదు. కావున నియ్యవసరమునఁ దగిన మనుష్యు నచ్చుటకుఁ బుచ్చవలయు. దుర్యోధనుఁడు వీరికి రాజ్యము పాలిచ్చిన మేలగును. అట్లు చేయఁడేని యప్పటికిఁ బోలినపని చూచుకొందము."

ఇట్లు కృష్ణుఁడు వలికిన విని బలరామదేవుఁ డియ్యకొని రాజలోకము నాలోకించి యిట్లనియె:

"కృష్ణుని వచన మిరుదెఱఁగుల జనములకును హితమును ధర్మోత్తరమునై యున్నది. కౌరవ పాండవుల వైరము నీ వెరవునఁ దీర్ప

బలరాముని వాక్యములు

మనకు శక్యమనియె నాకుఁ దోఁచుచున్నది. తమ సగపాలు గోలుపడి, దానిని యిప్పుడు గోరు వీరికి పాలిచ్చి, తన సగభాగమున సంతసమంది యుండుట సుయోధనునకు యుక్తము. దాన నపాయము దప్పును. పాండవులును గోపముడిగి బంధువులై యుందురు. లోకమునకుఁ బ్రియమగును. కావున నీ కార్యమెడసేయక యొక రాయబారినిఁ బంపవలయును. వాఁడునుఁ గౌరవసభకుఁ జని మాట పొం దెఱిఁగి, కౌరవేంద్రు జిత్తవృత్తి కనుగుణముగా నానతుఁడగుచుఁ బ్రార్థించి యడుగకున్నఁ గార్యము సానుకూలము గాదు. అది యెట్లనిన, ధర్మనందనుఁడు సుయోధనుని యుద్ధతికి సంకోచించి నమ్రతతో వర్తించుచుండియు, జూదమునందు మోసపోయి చిక్కునఁ బడియె. అదియునుఁ గాక సుయోధనుఁ డక్షవిద్యాపాటవము తన కంతగా లేకపోవుటయు, బంధుజనములు దన్ను వారించుటయు, తా నాడుటమాని గాంధారరాజును నియమించినఁ దత్కళాకౌశలమునఁ బరిణత ప్రజ్ఞుఁడు గావున నా శకుని యాడి గెలుచుచు

వచ్చెను. అట్లగుటచే నాతనియందపను గొఱంత లేదు. ఇత్తెఱఁగున ధార్తరాష్ట్రులు ధర్మపరులని నిందింపఁబోలదు. అందుచే వీరలుపుచ్చిన రాయబారి వినయముతోన యీ కార్యము దీర్చికొని రావలయును."

బలరామదేవుని యిప్పలుకులకు సాత్యకి కోపించి యిట్లనియె:

"బలరామా! ఇట్టి మాటలు నీకే తగును. నిన్ననుటేల? పాడిగాని యీ మాటలకుఁ జెవియొగ్గి యాదరించువారి ననవలెను.

సాత్యకి దుర్యోధను కడకు దూతఁ బంప కూడదని చెప్పుట

ధర్మజుఁడు వేడుకపుట్టి జూదమాడెనే? వారందఱుఁ దమలోఁ గూడికొని పిలిచి, బలిమిని యాడి కపట జయము నొందిరి. ఇది న్యాయమా? ధర్మజుని యందు దోషమును మోపి యెవఁడేని యీ సభయం దవమానముఁ జెందక పోఁగలఁడా? ధర్మజుని గాక మఱి యింకెట్టి వారిని ధార్మికు లందురు?

తమ సమయములఁ బాలించి, పైతృకమగు తమ రాజ్యభాగమును బడయఁగోరి, బలమును చలమును నెఱపఁగడఁగు వీరొరు వేఁడఁబోదురె? శత్రువులు సాధువుల మెత్తురె? రణరంగమున విజయలక్ష్మిఁ బడయుటకంటె వేరు రాజధర్మము గలదా? సముచితములగు మాటల జక్కఁబడక తక్కెనేని, కపటియగు ధార్తరాష్ట్రుఁడు పాండవులకు రాజ్యభాగ మిచ్చునట్లు క్రూరశరముల నే నియ్యకొలుపుదును. భీమార్జునులను రణమున నేవీరు లెదుర్కొనఁగలరు? వీరును నేనును సైన్యోద్దాములమై నడచిన నే భూమీశు లెదురునిల్చి బ్రతికి పోఁగలరు? కవలును, కుమారులును, పాంచాలురును, వృష్ణివరు

లును కలిసిరేని దుర్యోధనాది శతము నొక్క త్రుటిలోన నిశ్శేషముఁ జేయరా ? ఈ మత్స్యపతి సామాద్యుపాయపరుఁడు; ఉద్దామ భుజాబల యుతుఁడు; సామాన్యుఁడా ? అతని సహాయమున మాకుఁ దీర్పరాని కార్యము గలదే ? అందుచే సంగ్రామము సేయుటయ కార్యమని నామతము. ఇట్లు గాక కౌరవపతితో సామవచనముల నాడ బుచ్చెదరేని యీ దూత యుచితముగ నెట్టి దైన్యమును జూపక, రాజన్యవరుఁడగు ధర్మజుఁడు పాండునృపాలు పాలు సమ్మతిని వేడుచున్నాఁడని చెప్పనగును. లోకసామాన్యవిధి నాతఁడు సంతోషముగ నిచ్చినఁ బుచ్చుకొందము. అత డందుల కియ్యకొననిచో దాని ఫలమాతఁ డనుభవించుఁ గాక !"

**ద్రుపదుని వాక్యములు**

అనిన ద్రుపదుఁడు: "ఇది యుచితముగ నున్నది. బలదేవు మాట సరి గాదు. బలవిక్రమవంతుఁడును, దుష్టాత్ముఁడును నైన దుర్యోధనుఁడు ప్రియవచనముల రాజ్యము పాలిచ్చుట కియ్యకొనకుండుట సిద్ధము; అతఁడు యుద్ధమునఁ గాని చక్కఁబడఁడు." అని పలికి మఱియు నిట్లనియె :

"దుర్జనహృదయములు మృదుభాషణముల ప్రసన్నములగునె? దురభిమానముచే మఱింత మదమెక్కును. అదియును గాక దుర్యోధనుఁడు గుమతియైనను భీష్మ ద్రోణులు కూటమికై వాని ననుసరింతురు. ధృతరాష్ట్రుఁడును తనూజు తృష్ణనూనినవాఁడు. రాధేయునివంటి తులువలెల్లరును నతనిదే సద్బుద్ధి యందురు. కావున నతఁడు దుర్వినీతుఁడై యుండును. ఎట్లు జూచినను యుద్ధమగుట తథ్యము. ఈ సమయమున

బలములఁ గూర్చికొని పిలువఁదగు రాజులఁ బిలిచి పుచ్చవలెను. దుర్యోధనుఁడును దోడాసపడి దూతలఁ బంపును. ఉచితపరులగు నరపతులు దొలుతఁ జెప్పిన వారికి సహాయముఁ జేయఁజూతురు. మనము వడి గల కాలరుల వేగమ పుచ్చి శల్య కేకయ ధృష్టకేతు జరాసంధతనయ ప్రభృతులైన భూపతులకును, వారివారి బంధు మిత్ర జనములకును నెఱిఁగించి పుచ్చుట కార్యము. ఇది నాకు తోఁచిన విధము."

అని పలికి తనకెలన సముచితాసనమున నున్న విప్రవరుఁ జూపి:

"ఇతఁడు నా యగ్రపురోహితుఁడు. ఎల్లపనుల నెఱిఁగించి యితనిని ధృతరాష్ట్రుకడకుఁ బంపుఁడు. ధృతరాష్ట్రుని సమ్ముఖమునను, దుర్యోధనుని కడను, భీష్ముని సన్నిధిని, ద్రోణు నొద్దను క్రమోచితముగా నీ యీ విధములఁ జెప్పుమని చెప్పి పుచ్చుట యుచితము."

పాండవులు దూతను బంపుట

అనిన వాసుదేవుఁడు:

"పాంచాలపతి వచనము లుచితములై యున్నయవి. అట్ల చేయవలయును." అని పలికి మఱియు నిట్లనియె:

"కౌరవులకును పాండవులకును నే నొక్కరూప. అట్లగుట వారును వీరును తమతమ రాజ్యభాగములు సుఖముగ నేలుకొనఁ జూడనెంతును. పెండ్లికై పిలిపించిన వచ్చితిమి; ఇన్నాళ్లు నెల్ల యొప్పిదములఁ జూచితిమి; ఇయ్యెడఁ దడవుదాఁక నిలువఁదీఱదు. మాకు పోయి రావలయును."

అని పలికి ద్రుపదు నాలోకించి :

“మీరు మా కెల్లరకును గురుస్థానము. మీ మాట యనిన ధృతరాష్ట్రుఁడు బహుమానము చేయును. మిమ్ము శాంతనవుఁడును గొనియాడును. మీయందు ద్రోణ కృపాచార్యులు సఖ్యము, వాటెం తురు. అట్లగుటఁజేసి పాండవార్థమై యొక్క రాయబారిని పంపుట మీ భారము. మీ పలు కందఱపలుకు. మీరు చక్కదిద్ది పోవగా మిగిలి యుద్రేకులైనచో వారే చెడుదురు. ఒకసారి పొందైన మంచిదే. అటుగాక విరసమైనచో రాజులనెల్లను ముందర రావించి పిదప మమ్ము బిలువఁబంపుఁడు. మీ పనుపున ధార్తరాష్ట్రులు పాండవేయులకు రాజ్యము పాలీకున్నచో భుజాటోప భయంకరుఁడగు నర్జును కోపాన లము వారి నడరి ముట్టుకొనక కుండునా ?”

అని మురాంతకుఁడు గమనోన్ముఖుఁడై ద్రుపదుఁడును, ధర్మ నందనుఁడును, వృకోదరాదులగు తమ్ములును, మత్స్యమహీవిభుఁడును తన్ననుప, హలాయుధ ప్రభృతి యాదవలోకము తోడరాఁగ నిజ పట్టణమునకుఁ బోయెను. వివాహ మహోత్సవమునకు వచ్చిన తక్కటి రాజులును సంగ్రామ సన్నాహమునకై తమతమ పురములకుఁ జనిరి. కౌంతేయులు సమరమునకుఁ దగునుద్యోగమునఁ బ్రవర్తిల్లిరి. మత్స్యా ధీశుఁడును సన్నాహము చేసెను. ద్రుపదుఁడును సన్నద్ధుఁ డయ్యెను. ఇట్లు సన్నద్ధులై వెలిపీడు విడిసి తమకు ననురక్తులైన రాజుల పాలికిఁ దగు దూతలఁ బుచ్చిరి.

పాంచాలపతి యజాతశత్రు ననుమతి వడసి వయో జ్ఞాన వృద్ధుఁడైన తన పురోహితుని ధృతరాష్ట్రు పాలికిఁ బుచ్చువాఁడై యతని రావించి :

"హితుఁడవు; మతిమంతుఁడవు; చతురవచనకోవిదుఁడవు; సమయజ్ఞుఁడవు; ఉన్నతవంశవర్ధనుఁడవు; ఇంగితవేదివి; నాకు నెచ్చెలివి. నాకుఁ గర్తవ్యమగు పని నీకుఁ జేయ దగవు గావున బాండవార్థము ధృతరాష్ట్రు పాలి కరిగి నేర్పు వాటించి కార్యము తీర్పవలయును."

అని చెప్పి యొడఁబరచి యతనితో మఱియు నిట్లనియె :

"ధృతరాష్ట్రుఁడు కుటిలుఁ డగుటయు, ధర్మజుఁ డనుపమశీలుఁ డగుటయు నీ వెఱుఁగుదువు. ఐనను పాండవులకైఁ బుడమి పాలడుగఁ బోయి నీవు ధృతరాష్ట్రునితో ధర్మనిష్ఠమైన యుచిత మాడిన నక్కడి వారి మనస్సులు మన కనుకూలముగ మారుట వింత కాదు. గురు భీష్మాదులు యుద్ధమున కియ్యకొనకుండుటయు, దుర్యోధనుఁ డాతురుఁడై యుద్ధము సేయఁ గడఁగుట్లయు నిప్పుడు సిద్ధముగ నున్న సైన్యములకు నిరుత్సాహకరమగును. పండితవృద్ధ సజ్జనుల పాలికిఁ బోయి పాండుతనూభవులు పడిన పాటులు బంధువులకెల్లఁ దెల్పుచు, నిది కులోచితము కాదని చెప్పి, 'ఇదియ మేలు; ఒండొకచంద మొప్పదు' అని తక్కటివారు తలఁచునట్లుగాఁ జేసి సమస్త జనుల మనస్సులు పాండవపక్షమున కనుకూలించునట్టి యుపాయము లన్నియు నవలంబించునది. ఇచ్చట విరాటు కొలువుకూటమున కృష్ణాదుల పలుకులును వింటిమి. తదనురూపముగఁ బలికి పాండవులకుఁ దేజో

లాభముఁ గావించుట కర్తవ్యము. నీవు కరినగరమున వసియించి ధృతరాష్ట్ర ధార్తరాష్ట్ర గాంగేయ విదుర గురు కృపాదుల కడ కరిగి నానాఁటికి వారి వారి చిత్తముల తెఱఁ గెఱిఁగి ప్రవర్తింపుము. దైవ గతిం జేసి నీ యొడ్డిన సూత్రమునకు సుయోధనుఁ డొడఁబడెనేని, యదియ సకలజన సమ్మతమైన విధము. దాన నజాతశత్రుఁడును ప్రీతుఁడగును. పోయి రమ్ము." అనిన నమ్మహీసురవరుఁడును పాంచాల విభుని వీడ్కొని, ధర్మజుని, భీముని, నరుని, నకులుని, సహదేవుని, గని యనుమతుఁడై పాండవకార్యార్థియై కరిపురమున కరిగెను.

౨

దుర్యోధనుఁడు సకల రాజన్యసామాన్యముగ గోపాలదేవు పాలికి దూతను బుచ్చుట దగవగునా కాదా యని విచారించి తాను దుర్యోధనుఁడు స్వయముగ వెళ్ళిన బాగుండునని కతిపయపరిజన సహి కృష్ణు సహాయము తముగ శ్రీకృష్ణు పురమునకు పయనము సాగించెను. నర్థించుట అదే దివసమున ధనంజయుఁడును గోవిందుని చూడ వచ్చెను. ఆసమయమున శ్రీకృష్ణుడు పవళించియుండెను. కౌరవేశ్వ రుఁడు తలయంపి దెసనున్న తాసనము నలంకరించెను. సవ్యసాచి మెల్లన కాల్లడ యొద్దకుఁ జని వినమ్రుడై నిలిచెను. అంతఁ గృష్ణుఁడు మేల్లని యర్జును నాలోకించి, తర్వాతఁ గౌరవాధిపుఁ గని, ప్రసన్న ముఖుఁడై యిద్దర నాదరించెను. తదనంతరము వారలఁ జూచి కేశ

వుఁడు "వచ్చినకార్యముఁ జెప్పుఁడు" అని యడుగ దుర్యోధనుఁ డిట్లనియె :

"కయ్యముసేయ నాలోచనముతో సహాయముఁగోరి భవ త్సాన్నిధ్యమునకు వచ్చితిని. బాంధవమున కురుపాండవులు నీ కొక్కరూప. ముందు నిన్నుఁ జూడవచ్చినవాఁడను నేను. సుజనులైన వారు ముందు వచ్చినవారిక సహాయపడుదురు. మరి సౌజన్యసార యుతుఁడవగు నీ వన్యథా చేయుదువే? కావున లోకంబు పాడి విచారించి నీవు నాకుఁ దోడు గావలయును."

అనిన దుర్యోధనునకు వాసుదేవుఁ డిట్లనియె :

"ఇక్కడకు నీవు ముందు వచ్చినది నిక్కమే; కాని నేను పార్థునిఁ దొల్తఁ జూచితిని. కావున మీ కిద్దఱకును సద్భావముతో దోడ్పా టొసగు టుచితము. దీనికిం దెఱంగుఁ దప్పక యుండున ట్లేర్పఱచెదను. నీవును సవ్యసాచియు మీ మీ యిష్టముల ననుసరించి కోరికొనుఁడు. నాతో పదివేవురు గోపాలురు గలరు. వారు సమర కోవిదులు; బాహాటోపాభిరాములు; చాపాద్యాయుధ కళావిశారదులు; నారాయణాభిధానులు. వారు యుద్ధముఁ జేయుదురు. ఇఁక నొక్కఁడ నే నూరక బరమాప్తుఁడనై నిరాయుధ వ్యాపారతమై నుండువాఁడను. వారొక తల, నేనొక తల; ఈ రెంటియం దెవ్వరి కేది ప్రియమో చెప్పుఁడు. తొలితొలి బాలకులు గోరికొనుట పాడి."

అని పలికి హరి కిరీటిం గని :

"నీవుఁ బిన్నవాఁడవు గాన ముందు గోరికొనుము."

అన విజయుఁడు గృష్ణుని గోరికొనెను.

ధార్తరాష్ట్రుఁడు దాని కార్తిఁ బొంగి సైన్యములన తాను గైకొని బలరామ సదనమునకు సంతోషమునఁ బోయెను. అట్లు చని బలదేవుఁగని సమ్మానమునొంది తన వచ్చినకార్య మెఱిఁగించిన దుర్యోధనునకు బలదేవుఁ డిట్లనియె :

"అభిమన్యు వివాహమునకుఁ బ్రభువర్గమెల్ల గూడబడి యుండ నా సభయందు నేను నీకై వాదించితిని. దానికిఁ గొంద అసహ్యపడి పాండవ పక్షపాతమునఁ బ్రతికూల వచనములు పలికిన నవి కృష్ణునకు బ్రియములై యుండెను. అట్లగుటఁజేసి కృష్ణుని విడిచి యుండలేక పోవుటచేతను, విరసపుమాట లాడనొల్లకయు, నేమియు ననక, నొక నిశ్చయము వహించియున్నవాఁడను. అది యేమంటివేని వినుము : మీరును పాండవులును యుద్ధమునకు దిగినచో నే నూరక యుండెదను. ఎవ్వరికినిఁ దోడుబోను. ఇది నిశ్చయము."

అనిన విని దుర్యోధనుఁడు దానికియ్యకొని, సవినయముగా బలదేవుని వీడ్కొని, వాసుదేవునామంత్రణముసేసి, కృతవర్మ పాలికిఁ జని, యాతఁడొక్క యక్షౌహిణితోడఁ దన్నుఁగలయవచ్చువాఁడని యొఱఁబలికినఁ బ్రియంబంది నిజపురమునకరిగెను.

తదనంతరము కృష్ణుఁడర్జునున కిట్లనియె :

"భూరిపరాక్రములగు నారాయణగోపాలురను దుర్యోధనునకు విడిచి యుద్ధముసేయని నన్నేలగోరికొంటివి ? ఇది నీకు మేలగునె ?"

దాని కర్జునుఁడు హరికిట్లనెను :

"నేను రణమున సహాయమొల్లను. సుప్రసిద్ధుడవగు నీవు యుద్ధము జేసిన నీకే పేరగును. నీకెదురై యెట్టివారికి జయముగాన సాధ్యముగాదు. అట్లగుటచే విజయమూలమగు నీతోడు వలయును. నీవు సమరము సేయకుండుటయు నాకుఁ బ్రియము. కావున నిన్నుఁ గోరికొంటిని."

అనిచెప్పి యతఁడియు నిట్లనెను :

"కృష్ణా ! నాకు సారథివై చిరకాల వాంఛితమగు నాకోర్కెను తీర్పుము."

అనిన యర్జునునకు హరియిట్లనెను :

"పార్థా ! నీ కోర్కె తీర్చుటయ నాకువ్రతము. యుద్ధమున నీకు సారథినగుదును."

ఇట్లు కిరీటి నూరడించి, యతనినిఁ దోడ్కొని కార్యాలోచనమునకై హరి ధర్మతనూజు నొద్ద కరిగెను.

3

దుర్యోధనుఁడు శల్యసహాయముఁ గోరుట

అంతట శల్యుపాలికిఁ బోయిన దూత లతనిఁ గాంచి సముచిత వచనముల సమరసహాయమునుఁ గోరి పిలిచిన, నతఁడు ప్రీతుఁడై పుత్త్ర మిత్త్ర సమేతముగా నానా సేనాతిసంకులముగాఁ గదలి పాండవులున్న యెడకు నిత్యప్రయాణముల నడచు సమయమున నిదియంతయు విని దుర్యోధనుఁడు తన యాప్తజనములను మద్రనాథుని మార్గమున కడ్డముగఁ బంపెను. తానుఁగూడ నిగూఢముగ బయలుదేరెను. దుర్యోధనుఁడు పంచిన పరిజనులు శల్యసేనలకై నిర్మలోదకము గల నడబావులను త్రవ్వించి, యేనుగులకును, గుఱ్ఱములకునుఁ గొట్టములను కట్టించి, యాస్థానమండపములును, బియ్యములు, నేయి, పెరుగు, కూరగాయలు, వంటకట్టియలు, గడ్డి, కవణములు మున్నగాగల సమస్త వస్తుసంచయమును నాయత్తపరచిరి. ఇవ్విధముగ విడిదల పయనంపు సంపదలు పొంపిరివోవఁ దనకు సమకట్టిన సమస్త వస్తువుల యవైకల్యమునకు శల్యుఁడు సంతుష్టాంతరంగుఁడై నిజపరిజనముఁ జూచి: "ఇట్లు చతురముగా మనకు వలయువాని నాయత్తపరచిన యుధిష్ఠిరామాత్యులెవ్వరు ? వారిఁ దోడ్కొనిరండు. వారు ప్రసాదదానంబులకర్హులు" అనెను. అంతమున్నె పలు తెఱంగులఁ బనులు సేయుచున్న తన పల్లాయనము వారిలోఁ గలసి మఱువడియున్న కౌరవేశ్వరుఁ డమ్మాటలు విని, యతనికిఁ బొడసూప నిదియ సమయమని సముచిత ప్రకారమున మద్రేశ్వరునకుఁ దన్నెఱింగించుకొనెను. శల్యుఁడును

సంభ్రమమునఁ గౌరవేశ్వరునిఁ గాఢాలింగన మొనర్చుకొని కనకాసనమునఁ గూర్చుండబెట్టి 'ఇంతయు నిమ్మహాత్ము నుద్యోగమున నయ్యెంగావలయు' నని తలఁచి విస్మయమంది 'నీ కెయ్యది యిష్టమో కోరికొనుము. ఇచ్చెదను' అనిన గాంధారీ తనయుఁడు పరమానందమునఁ బొంగి యిట్లనియె:

"సత్య సరస్వతి వగుము. నీ చిత్త మౌచిత్యవిశారదము. నా కమాత్యుఁడవై నా సైన్యమును నడపుము. నీకు కురుపాండవు లొక్కరూప. ఐనను న న్ననుగ్రహించి నాకు మంత్రివగుము."

అన శల్యుఁడు దాని కియ్యకొని: "నా మనమున విభేదవృత్తి లేదు. పాండవులును మీరును నా కొక్కరూప. నీవు నన్ను ముందు చూచితివి. కాన నేను నిన్న గూడెద. మ రేమి వలయునో కోరికొనుము."

అనఁ గురుపుంగవుఁ డెంతయుఁ బొంగి: "నీవు సమ్మానము సేసి నా కి ట్లమాత్యుఁడ వగుటకంటె నాకుఁ గోరవలసిన దేది కలదు ?"

అనిన వికచవదనుఁ డగుచు మద్రేశ్వరుఁడు:

"నీవు హస్తినగరమునకుఁ జనుము. నేనుఁ బాండవులఁ జూచి వత్తును. వారిఁ జూడక తప్పదు. పోయివచ్చెదను" అనెను -

కౌరవేశ్వరుఁ డతనిని వీడుకొల్పుచు:

"అట్లయగుఁగాక. అటకుఁబోయి వేగముగ మరలుఁడు. వరము

మఱవకుండవలయు సుమా. మిమ్ముఁ గూడియే నేను నెగడువాఁడను-దయయుంచుడు" అనెను.

మద్రేశ్వరుఁడును దరహాసముతో నాలింగనముసేసి "సందేహ పడవలదు. ఇంక మరలుము." అనుటయు దుర్యోధనుఁడు సంతుష్టాంతరంగుఁడై కరిపురమునకుఁ జనెను.

౪

శల్యుఁడు పాండవులఁజూడ నుపప్లావ్యమునకు వచ్చుట.

అంత శల్యుఁడు నుపప్లావ్యమునకుఁ బోయి, స్కంధావారము దఱియంజొచ్చి, ధర్మనందనుని నివాసమునకరిగిన, నతఁడుఁ దమ్ములుఁ దానును, ద్రౌపదీ సుభద్రలు, నభిమన్యుప్రభృతి పుత్రవర్గమును, నెదురువచ్చి, కృతప్రణాములై తోడ్కొనిపోయి, కాంచనాసనమున, గూర్చుండ బెట్టి, యర్ఘ్యపాద్యములిచ్చి, కుశలమడిగిన "సర్వమును కుశల సంపన్నము" అని వారి నందఱ నభినందించి యుధిష్ఠిరునిఁ బునరాలింగనముసేసి యిట్లనియె:

"ధర్మజా! జనరహితమగు వనమున ననుజన్ములును ద్రౌపదియు నీవును నింతకాలమలయక యుండుట కడు దుష్కరము. దానికంటె నజ్ఞాతవాస ముజ్జ్వలాంగభాసమానులగు మీకు కష్టము. ఐనను మీ దయాసుకృతాదుల పెంపు మిమ్ముఁ గడవఁ బెట్టెను."

"ధర్మజా! నీ దుఃఖమునకు జగమంతయు నొచ్చినది. నీ విప్పు డఖిల దురితములనుఁ గడచుటకు సమ్మోదముఁ బొందెను."

అని యుచితసంభాషణములు సేసి, దుర్యోధనుఁడు దన్నుఁ గాంచిన విధమును, నతఁడు ప్రార్థించిన తెఱఁగును, దానికిఁ దానియ్యకొనుటయుఁ జెప్పిన ధర్మనందనుఁ డతని కిట్లనియె:

"మేలు సేసితిరి. ఒకరి మెచ్చి వారి కోర్కె తీర్చుట పెద్దల గుణము కాదె? అది నాకు హర్షాస్పదమే. ఐన నొక్కటి వేడెద నవధరింపుడు:

"పార్థునకుఁ గృష్ణుఁడు సారథ్యముఁ జేయువాఁడై యున్నాఁడు. కర్ణుఁడు పార్థుతో నెప్పుడు మచ్చరించుచు నుండును. వీరిరువురకు సంగ్రామమైన యప్పుడు గృష్ణునకుఁ బ్రతి సారథ్యమొనరింప మీర కాని యం దొక్కరుఁడు లేఁడు. కావున నవశ్యము మీకుఁ గర్ణసారథ్యము గర్తవ్యము. సమరసమయమున నిరాకరించి పలికి కర్ణుచిత్తమునకుఁ గలఁక పుట్టించి పార్థు రక్షింపవలయును. అకృత్యం బని యనుమానింపక మత్ప్రార్థనమున నెల్లభంగుల నివ్విధ మనుష్ఠింపఁ గోరెద." అని యభ్యర్థించిన సమ్మతించి శల్యుఁ డిట్లనియె:

"అట్లే చేయుదును. 'కర్ణునకు రథముగడప నీవ తగుదువు' అని దుర్యోధనుఁ డనిన నే నతని ప్రార్థనము సలుపవలసివచ్చును - కర్ణుని సారథి నైనను నే నర్జునునిఁ గాచెదను - దుర్ణయవిచారుఁ డగు కర్ణుని కఠోరములాడి కలఁతును. కర్ణుని తేజోదర్పములను చెఱచి,

యతఁడు యుద్ధమున డీలుపడునట్లు చేయుచును. అప్పు డర్జునుఁ డతనిని తీవ్రబాణపరంపర పాలుపఱుచును."

"ఇది యొక్కటియె గాదు. నీ వెద్దికోరిన నది చేయువాఁడ. నాఁ డదయతఁ గర్ణుఁడు సభ నాడిన మాటలకుఁ జాల నొచ్చి మా హృదయములు నీయెడ పక్షపాత మూనియున్నవి. అదియుఁగాక మీరు పడిన కష్టము లెవ్వరి నొవ్వఁజేయవు? ఇట్లు పాట్లు పడితినని వగవకుము. నీ మనోరథము ఫలించును. దేవతలైన నొక్కొక్క యవసరమునఁ బాట్లుపడుదురు. తొల్లి వాసవుఁడుసైతము నిజకాంతా సహితముగ నధికదైన్యము నొందెను. మీ సంపద యేపాటి? విధి చేసిన గతిఁ బడకయుండుట శివునకైనను వశమే?" అని సభాసదులఁ గలయం గనుంగొని "కౌరవనాథుఁడు నహుషుఁ బోలె నాశముఁ బొందును - ధర్మజుఁడు వాసవశ్రీరమణీయుఁడై జయము సేకొని తమ్ములఁ గలసి సమస్త భోగముల సన్నుతి కెక్కును" అని తిరిగి ధర్మజున కిట్లనెను :

"ధర్మజా! అర్జునుఁడు కృష్ణసహాయమున రిపుసందోహములఁ గెల్చుట నిస్సందేహము."

అనిన విని ధర్మనందనుఁడు మద్రపతిని బ్రస్తుతించి "మహాను భావా! భవదీయ భాషణశ్రవణమునఁ జిత్తము కలకదేఱెను." అని సంభావించి, యతనికి సముచితమగు మజ్జనభోజనము లొనరించెను. మద్రపతి ప్రయాణసన్నద్ధుఁడగుటయు నతని సాగనంపఁబోయి యుధిష్ఠిరుఁడు మఱొకమారు "యుద్ధరంగమున మీరు రాధేయుని

దూలనాఁడుటను మరువకుఁడ"ని హెచ్చరించెను. మద్రపతి ధర్మజు నూరడించి, గాఢాలింగన మొనర్చుకొని, తన సమస్త బలముతో హస్తినాపురి కేగెను.

౩

అట పాంచాలమహీవల్లభుఁడు పంపిన భూదేవుఁడు కరినగరమును జేరి, ధృతరాష్ట్రునిఁ గాంచి, కృప ద్రోణ విదుర గంగాసుతుల మందిరముల కేఁగి వారినిఁ జూచి, సముచితాలాపముల వారిఁ బ్రసన్నచిత్తులను జేసి, దుర్యోధను సందర్శనమును నిర్వర్తించి, నిత్యనిపుణారాధనమున ధృతరాష్ట్రు నభిముఖుని గావించుకొని యొక్క నాఁ డక్కౌరవేశ్వరు పేరోలగమున సమస్త సేనాపతులఁ గలయం గనుఁగొని యిట్లనియె :

రాయబారము

"ధృతరాష్ట్ర పాండుభూపతులు సహోదరు లగుటయు, వారల యాత్మజులకుఁ దమతమ తండ్రుల ధనములు పంచుకొన భావ్యమగుటయు మీ కందఱకును సమ్మతమే కదా ? అది యట్లుండె. తొల్లిఁటి విధమును మన కందఱకుఁ దెలిసినదే. ప్రాణగొడ్డము లగు పనుల నిచ్చి వారిని చంపఁ దలఁచినను, పున్నెంబుకలిమిఁ జేసి యాయపాయములఁ దప్పించుకొని, పాండవులు తమ బాహుబలముచే నిజరాజ్యమును సంపాదించుకొనుటయు, తిరిగి వంచించి కౌరవులు వారి రాజ్యము నపహరించుటయు మీ రెఱుఁగుదురు కదా ? దీని

కంతకును ధృతరాష్ట్రమహీపాలుఁ డియ్యకొను టెంత విచారకరము ? సభలోని వారలు చూడగా ద్రౌపది నట్లు దెచ్చి చీర లూడ్చినను, రాజ్యము నపహరించినను, నరణ్యముల నుండబంచినను, నేమి చేసి ననుఁ బడియుండిన పాండవులతో సంధిచేసికొనుట యుచితముకాదా? వీరి వృత్తమును, పాండుకుమారుల ప్రవర్తనమును, మాత్సర్యము లేక యాలోచించి, మీరు ధృతరాష్ట్రభూపతి కేది యుచితమో చెప్పుఁడు. అఖిల భూప్రజా నాశనమగుటఁజేసి పాండవులు కౌరవుల తోడి పగకు నొల్లరు. ఇంతమాత్రమున వారు బలహీనులని తలఁపఁ జెల్లదు. పాండవు లధిక ధర్మపరు లగుటచే నింతగా నాలోచించు చున్నారు. వారికిని సహాయముగా నే డక్షౌహిణుల బలములు కూడి నవి. కౌరవపక్షమునఁ గూడినవి పదునొకం డక్షౌహిణు లని తలఁతు రేని వినుఁడు : బాహుబలఘనుఁ డగు భీముఁడును, సాహసరసికాత్ముఁ డగు సాత్యకియు నాహవభూమిని సహస్రాక్షౌహిణులకును జాలుదు రని మీ రెఱుఁగరే ? అర్జునుని యుద్ధరంగమున మార్కొనగోరుట కొండను పొట్టేలు దాకగోరుట వంటిది. ఆ భీభత్సుని భూరిభుజా బలమును, దుర్నివార శౌర్యమును, శరవిద్యా బహుళతయునుఁ బంది కినై బవరముఁ జేసినట్టి హరుఁడే యెఱుఁగును.

"అదియునుఁ గాక వివిధోపాయపరాయణుఁడును, రిపుదోర్గ ర్వాపహారక్రియాప్రవణోద్యోగుఁడును, మంత్రరక్షణ కళాప్రావీణ్య గణ్యుఁడును, ధైర్య వివేకాది గుణోత్తరుఁడును, నఖిల విద్యాజాల సంవేధియు నగు మాధవుఁ డాదికుడైన నుండ బాండవుల కసాధ్య

మెద్దియైన నుండునా? అంచుచే నా మాట విని యమ్మహాత్ములఁ బిలువఁబంచి, హితమును ప్రియమును రెండు పక్షములకుఁ గలుగు నట్లు కొంత భూమి వారికిచ్చి కలిసి యుండుఁడు.''

ఈ మాటలు విని భీష్ముఁ డిట్లనియె:

"పాండవు లాపదలను తరించి ప్రశాంతిమై మనముల నీసు దక్కి మృదు మార్గము నవలంబించుట యెంతటి భాగ్యము!

భీష్మ కర్ణుల వాగ్వాదము

భూసురోత్తమా! నీ వాక్యము విప్రస్వాభావికమై శ్రుతికిఁ బరుషమైనను సభ కిష్టమైనది. ఆడిన మాట తప్పక, యశక్తులవలె బాండవులు నాఁ డీ సభలో బన్నమువడి చన్న దైన్యము, వనమునబడ్డ విషాదవేదనాశ్రమము, విరాటువీట లఘుసంచరణమున దాఁగియున్న దుఃఖమును, జగ మెఱుఁగదె? అకల్మషులను బాధించుట పాడికాదు. పితృధనమగు పాలు పాండవుల కిచ్చి ధృతరాష్ట్రుఁడు వారిని నిజసుతులవలెఁ జూచుట భావ్యము. అవ్వు గాదన నేరక, జూదమాడి, మాటతప్పిన ధర్మచ్యుత మగునని రాజ్యాపహరణమును సైత మోర్చుకొని ధర్మజుఁ డాజ్ఞాపించిన సైరణచేసెనుగాని, కవ్వడి కోపము నిజ్జగమున నెట్టి మగవారైన నోర్వఁగలరె?''

అనిన విని కర్ణుఁడు గనలి యిట్లనియె:

"అంద రెఱిఁగిన దీనిని మాటిమాటి కుగ్గడింప నేల? సుయోధనునిపక్షమున శకుని జూదమాడి రాజ్యమును గెలిచెను. ధర్మజుఁ

డోడెను. అరణ్యములపాలై, బానిసతనమును నిర్వర్తించి, తగునంచు తండ్రిపా లడుగుట తప్పుగాని యిందు సుయోధను తప్పేమి కలదు? విరటుఁడును, ద్రుపదుఁడును తోడుగ యుద్ధమునకు వచ్చి విడిసి బలిమి నడిగిన సుయోధనుఁడు వెఱచి చక్కగా సగమురాజ్య మిచ్చునె?"

అనిన గాంగేయుఁడు గటకటంబడి కర్ణున కిట్లనియె:

"కర్ణా! గొప్పశూరుఁడవులే! విన్నవారు నవ్వునట్లు పెద్ద మాట లాడెదవు! నిన్న మొన్న గదా యర్జునుఁడు మనల నార్వుర నొక్కడ గెల్చెను! నేఁ డిక్కడ రాజసభలో నతనిని మాటలతోఁ గెల్చెదవు: నరుఁ డాలవెనుక వచ్చినప్పుడు కురురాజుఁగగా నీవును గురుఁడును కృపాశ్వత్థామలును వినునట్లు పాండవుల యజ్ఞాత వాస దీక్షాకాలము గడచెనని నేను చెప్పలేదా?"

అనిన ధృతరాష్ట్రుఁ డాపగాతనయుని భక్తి ననునయించి, రాధేయునిఁ గినిసి, ప్రియముదోఁప ద్రుపదు పురోహితున కిట్లనియె:

"నేను బంధువులను, మంత్రులను, పెద్దలను మంచిగ విచారించి, ప్రజలకుఁ బ్రీతియగునట్లుగ బిడ్డలపాలికి సౌమ్యు నొక్కనిఁ బుత్తెంచెదను. కౌరవ పాండవులు గలిసి బ్రదుకుటకు సమ్మతించుటయే కౌరవజాతి కెంతయు మేలు. నీవు ముం దేగుము." అని యతనికి విభూషణాంబరములతోఁ దమ్ములంబు బెట్టి వీడుకో లిచ్చి పుచ్చగా విప్రవరుఁడు పాండవేయుల కడ కేఁగెను.

ధృతరాష్ట్రుఁడు దూతను వీడ్కొల్పుట

ధృతరాష్ట్రుఁడు పుత్త్ర మిత్త్ర వృద్ధామాత్య సహితముగా నాస్థానాసీనుఁడయి యుండి సంజయుని రావించి యతని కిట్లనియె :

"పాండవు లుపప్లావ్యమునకు వచ్చి యున్నారు. నీ వేఁగి వాసుదేవసహితముగ వారిని సందర్శించి, విషాదకరమగు యుద్ధమును మానునట్లు పలుకుము."

"మీ యయ్య మీరు వనవాసాయాసమును నిస్తరించి యభ్యుదయమున నున్నారని విని ముదితాత్ముఁడై యిట నన్ను పుత్తెంచెను." అని మొదలనుము.

అని సభాసదులఁ జూచి

"దుర్యోధనుఁడు కార్యాకార్యజ్ఞుఁడు గాకపోవుటచే నిట్టికలఁక గలిగెఁగాక, ధృఢధైర్యులును రణధుర్యులును నగు పాండవులు దోషాన్వితులే? మనమును వారును క్షీరోదకములవలె కలసి బ్రదుకవలదె? వా రిడుమల బడఁ దగువారే ? పితృభాగ మేలుకొనువారు గారే ? మనల నన్నృతాత్ములనియు, నన్యాయపరులనియు, గర్వులనియు నెంచి పాండవు లింక మనల నమ్మరు. మనతోఁ గూడి మనుట కియ్యకొన నేరరు. ఐననుఁ దగవునడపుటకు ధర్మజుఁడు గలఁడు. రాజ్య మీయకుండుట మనకు సాధ్యమా ? మనము దుర్మానము వాటించి వారికిఁ బాలీయక గర్వించిన కృష్ణుఁడు సారథియై రథము నడుపఁగాఁ నిక్కమగు నల్క నర్జునుఁడు గాండీవము మోపెట్ట జగత్త్రితయ సంక్షోభము గాదే? అలఘుగదఁ బూని భీముఁ డతిరయమునఁ గౌరవులపైఁ

దీవ్రకోపముతోఁ గవియుటను నాత్మఁ దలఁచిన గంపముపుట్టెను. నిజముగ నతని మాఱొంటిని యెవ్వరు నిలువఁజాలుదురు ? కవలు తమ యన్నలకంటె దీసిపోవువారుఁ గారు. మఱి ద్రుపదుఁ డల్పుఁడా ? ద్రుపదసుతులు బాహుగర్వసమగ్రులు. విరాటుఁడును సామాన్యుఁడు గాఁడు. సాత్యకియు వృష్ణికుమారులును యుద్ధమున సంకోచించువారు గారు. పాండ్యుఁడును కేకయపతులును మున్నగు బంధు మిత్రులు యుద్ధమునకు జంకువారు గారు. నీ రందఱను గెల్వనోపినను, రుద్రున కును నోర్వరాని ధర్మపుత్త్రు కోపమునకుఁ దలఁక వలదె ?"

అనిబలికి సంజయుదిక్కుఁనవలోకించి యెల్లవారునువిననిట్లనియె:

"నీవు ధర్మజు పాలి కరుగుము. అతఁడు పేరోలగమున నున్న సమయమున నతని దర్శింపుము. అచట నతనికిని, నతని యనుజవర్గ మునకును, బంధువులకును, ప్రియమగునట్లు పలుకుము. నెయ్యము వాటించి, ప్రియవచనముల, నలుకలెల్ల దీఱునట్లు, కయ్యమను తలఁ పును ధర్మజుఁడు మానుకొనునట్లు శాంతిమైఁ గార్యము నడపి యిరు వాగులు నొక్కటియై మనుట యొడఁగూర్చి రమ్ము. రథమెక్కి పొమ్ము." అని తగిన తెఱఁగున వీడ్కొలిపెను.

౬

సంజయుఁడును నుపప్లావ్యమును జేరి మాధవు మందిరమున కరిగి, యభ్యంతర వినోదముల సరసహితుఁడై యున్న నారాయణు

నకుఁ దనరాక నెఱిఁగించి పుచ్చి, యభ్యంతరముఁ బ్రవేశించి, భయ

సంజయ రాయబారము

భక్తి వినయసంభ్రమములు మెఱయ వారలఁ గాంచి, యమ్మహాత్ము లిరువుర సంభావనములును సంభాషణములునుఁ బడసి సంప్రీతచేతస్కుఁడయ్యెను. మఱు నాఁడు ధర్మతనయుఁడు పేరోలగమున్న సమయము వేచి, సముచితముగా నతనిం గని సాష్టాంగముగాఁ బ్రణమిల్లిన నతఁడును ప్రియపూర్వకముగా నాదరించి సమీపమునఁ గూర్చుండబంచెను. ఇట్లు సముచితాసనాసీనుఁడై సంజయుఁడు ధర్మజు నుద్దేశించి యిట్లనియె:

"భాగ్యమునఁ నిన్నుఁ గనుఁగొనబడసి నాకన్నులు చరితార్థములయ్యెను. మీతండ్రి ధృతరాష్ట్రజనపతి యిందు మీ రుండుటను విని మీ యందరి యోగక్షేమములఁ గనుఁగొన నన్ను నితాంతస్నేహపూర్ణమైన చిత్తముతో మీకడకుఁ బుత్తెంచెను."

అనిన సంజయునకు ధర్మనందనుఁ డిట్లనియె:

"ధృతరాష్ట్రజనపతికి మాయందలి దయవలన మేము సుఖముగ నిట్లున్నాము. గారవమున నిన్నుఁ బంపుటకు సంతుష్టాంతరంగుఁడనైతిని. అ మ్మనుజేశ్వరునకు సేమమే కదా? కౌరవులు సుఖముగ నున్నారా? మనుమలు సమ్మోదమున వర్ధిల్లుచున్నారా? దేశమున శుభసంపద లలరారుచున్నవా? భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు కుశలముగ నున్నారా? కౌరవులు భీష్మునకుఁ బెద్దతన మిచ్చి మెలఁగు

దురే? బ్రాహ్మణులు గౌరవింపబడుచున్నారా? మే మిచ్చిన మాన్యములు సాగుచున్నవా? మా ప్రసక్తి యెప్పుడైన వచ్చుచుండునా? పాండవుల దిగ్విజయయాత్రల ప్రశంస యెప్పుడైన జరుగుచుండునా? ఎన్నిమార్లు పాండవులు దిగ్విజయము మొనర్పలేదు? అదంతయు వారు బ్రత్యక్షముగఁ జూచియు మెచ్చరా? ఆటోపమున ఘోషయాత్రకు గంధర్వులు వచ్చినప్పటి చరిత్రను మఱచియుందురా? సంజయా! మనము మధ్యస్థులము. నీవే చెప్పుము. యుద్ధమున నర్జును నెదుర్కొని యింతవర కెవ్వని ప్రాణమానములు దక్కెను? దుర్యోధను నింటఁ గార్యాలోచనమునకు మంత్రిగను, యుద్ధముల శూరుఁడుగను దననేర్పును జూపుచున్న కర్ణుని యార్యత్వము లెస్సగ సాగుచున్నదా?"

అనిన విని సంజయుఁడు సవినయముగ నిట్లనియె:

"కురురాజునొద్ద నవినీతులు, నీతిమంతులు, సత్త్వసంపన్నులు, దురహంకారులు నగు పలుతెఱఁగులవారు చేరియున్నారు. వారొకళ్ళొకళ్ళమాటలఁ బోయెడివారు గారు. కావున వారి నంత యనఁ బని లేదు. నా విన్నపముఁ జిత్తగింపుము:"

"నీ విందు శిశిరమైన విమలహృదయముతో పొందుసేయఁ దలఁచితివి. ఇంతకు మున్ను వారు సుఖులై యుండకపోయినను నేఁడు మొదలు వారు సుఖులై యుందురు. వృద్ధతకతమునఁ జిత్త మొకవిధముగామి ధృతరాష్ట్రభూపతి నాఁడు సుతోద్ధతిని మాన్పఁ

జాలఁడాయెను. పిదప మనఃక్షతి పుట్టి యిపుడు శాంతుఁడయ్యెను. నీ యజాతశత్రుత్వము నిఖిలలోక విశ్రుతము. అందుచే నీవు పుణ్యాచిత్త వృత్తిమై వీనినెల్ల సైఁచనగును. మహీసురులు జగమునందలి పాపములను హరించుటకై పరమేష్ఠి నిల్పినవెలుఁగులు. అట్టివారికి సత్పురుషదత్తములైన మడిమాన్యముల నెంతటి కుమతులైనను లాగికొందురే?"

" 'పాండుకుమారులు దుర్వారబలులయ్యు నాగ్రహించి యధర్మమునకుఁ బూనరు. వారు శాంతాత్ములు' అని జనులు పొగడుదురు. అది యట్లుండె. ధర్మజా! భవదనుజులును, నాప్తులును, శ్రీకృష్ణుఁడును వినుచుండ నీకు విన్నవింపవలసిన పలుకులు గల వవధరింపుము."

అన ధర్మనందనుఁడు: "వారే తమ్ములును, గృష్ణుఁడును; వీరే యాప్తులు. నిన్నేమనుమని పంచె నది యంతయుఁ జెప్పుము." అనిన సంజయుఁడును ధర్మనందను గరువంపుఁబలుకుల విధమునకు మదినులుకుచు కృష్ణుని సద్భక్తి నీక్షించి భీమార్జున నకులసహదేవ ద్రుపదనందనుల సవినయమునఁ గనుఁగొని, పాంచాలుని విరటుని ప్రీతిం జూచి "సావధానులై వినుఁడ"ని పలికి యుధిష్ఠిరు దెసకు మోడ్పుఁగేలు నిగిడించి యిట్లనియె:

"శాంతతఁ బొంది కార్యమందు ధృతరాష్ట్రమహీశుఁ డాత్మనిశ్చయబుద్ధి గలవాఁడై ప్రీతితో నన్నియ్యెడకుఁ బంచునప్పుడు నాకు రథము స్వయముగఁ బన్ని నానతిచ్చెను. ఈవిధముగ సంధికై యాతఁ డాతురుఁడై యున్నాఁడు. ఇదే సమయమున మనము లాభమునొందవలెను. సర్వధర్మ

సంజయ వాక్యములు

జ్ఞులనియు, శాంతులనియుఁ బ్రసిద్ధులైన మీవంటిపెద్దల కిట్టి కార్యముఁ జులకన చేయదగునే? మడుఁగు జీరయందు మసి దాఁకినట్లు సత్కులమున దుర్యోధనుని కతనఁ గల్మషముగలిగెను. దీని నంతటను క్షాళిత మొనర్ప నీవ నేర్తువు. అఖిలజనక్షయమై జయమైనను నపజయమైనను తుదిని సుఖముగాని యీ పనికి నుత్తము లియ్యకొందురె? బాలవృద్ధులను, గురువులను, బంధుమిత్రులను జంపినవచ్చు నీ నిఖిల సుఖములు నేమిటికి ?"

"హరి నీకు పెట్టనికోట. భీమార్జునులు యుద్ధమున కార్చిచ్చుల వంటివారు. ఇంక సాత్యకియును విరాటుఁడును సామాన్య యోధులా? ద్రుపదుఁడును వీరాగ్రగణ్యుఁడు. యుద్ధమునకు నీ వొల్లవుగాని సురలైనను నిన్నెదిర్చి నిల్వఁగలరా? మఱి యక్కడనో భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలునుఁ, గర్ణ శల్యులును సుయోధనుని ప్రాణముల వంటివారు. నిజానుజన్ములా యక్షీణపరాక్రములు; సుతు లజేయులు; బాహ్లీకసోమదత్తులు స్థాణునకైన నోడరు. వారిని జయింప నెవ్వరి తరము? ఇట్టి మీ యిరుపక్షములకును కలహము నాకు మే లనిపించదు. రెండుపక్షములకుఁ బ్రియమును హితమును గోరువారి నడిగి చూడుము."

అని పలికి సూతనందనుఁడు గొలువు గలయఁ జూచి:

"వాసుదేవునకు మ్రొక్కెదను; సవ్యసాచికిఁ జేతులుమోడ్చెదను; తక్కటి మిత్త్ర బాంధవ హిత ప్రియ మంత్రి వయస్యకోటికి

స్రుక్కుచు విన్నవించెదను. అసూయలు దక్కి యనుజ్ఞసేయుఁడు. క్రోధశాంతి కిక్కరుణాకరు శరణు వేడెదను."

అనుచుఁ బ్రణామపూర్వకముగఁ బాండవాగ్రజు వదనమునఁ జూడ్కి నిలిపి :

"దేవా ! ఉపశమించుట లెస్స. ఇమ్మెయికిఁ గురుపితామహుఁడును సంతసిల్లు. అతని కనుమతమైన తెఱఁగు సర్వలోక సమ్మతమగును."

అన విని ధర్మనందనుఁ డిట్లనియె.

"సంజయా ! నాపల్కులం దియ్యెడ నెయ్యముదప్ప నొండొకటి నీచెవి సోఁకెనె? యుద్ధము లేక మనుట మా కుచితము గాదొకో ?

ధర్మరాజు వచనములు

రణము లేక గలిగెడు యర్థసిద్ధి నొల్లక యెంతటి వెడగైనను మఱియొక ప్రయత్నము సేయునే ? భీమార్జునులు దుష్కర్మములకు సిద్ధపడుదురా ? ఒప్పని తృష్ణంబడి కొందఱుజనులు మనస్సున సుఖముఁ గోరి దుఃఖదాయకములగు కార్యములకు నుత్సాహము జూపుదురు. తృష్ణనై నెంతటి బెడిదంబులకు నైనన సొత్తురు. పోరాటములు సంతాపకారకములుగాక సుఖప్రదము లే ? భోగములు వలదా యని తలఁతు మేని వస్త్రమాల్యాను లేపనములకును, జతుర తూర్యత్రయములకును, మేము దూరముగ నుండ, మా తండ్రియగు ధృతరాష్ట్రభూపతి కెట్లు రుచించును ? నిజపుత్త్రుల నాదరించి మ మ్మేల వెడలగొట్టును ? ఐనను నొక మాటఁ జెప్పెదను. సమగ్రచిత్తుఁడవై వినుము.

"ధృతరాష్ట్రభూపతి నాఁడు తాను వక్రుఁడై నీతిపథమును విడిచెను. ఇపుడు చక్కని తెరువున నడువుఁడని మాకు బుద్ధులు సెప్పుచున్నాఁడు. ఒరులను తమవలెనే తలఁచినచో ననుకూలపడును గాని, 'మాకుఁ గుఱుమీయుఁడు మీరు ముక్కఁగొనుఁ' డని యాచితి నుల్లంఘించిన యెడల మనసునఁ గలయిక చక్కవడునా?

"సంపదదక్కి యశక్తుల మనిపించుకొనుచున్న మమ్ముఁ బిల్చి పూజించుట కంత బేలయే ధృతరాష్ట్రుఁడు? పెద్దలమాట నాఁడె యేల మన్నింపఁడాయెను? ఇప్పుడుమాత్ర మతఁ డేల మన్నించును? నీ వడియాసల వచ్చి యూరక గారింపక మానుము. ఆతని చరిత్రము నీకును మాకును గ్రొత్తయే? అంబికేయుఁ డెన్నఁడైన నుచితవచనముల కియ్యఁగొనునె? విషము మ్రింగినను గొడుకు శౌర్యవంతుఁ డని నమ్మి చూచుచుండును. జూదపుసిరి కాశపడ భావ్యముకాదని విదురుఁ డప్పుడు చెప్పఁగాఁ గర్ణాదుల పలుకులు విని కౌరవేశ్వరుఁ డాదరింపనిచో దానితో నది యంతమొందియుండును. నిజసుతులును శకునియు సూతసుతుఁడును నెట్లు నడిపించిన ధృతరాష్ట్రుఁ డట్లు నడచుఁ గాక యొండగునే? వ్యవహారక్రమ మిట్టిది. దుర్యోధను చిత్తవృత్తి తెలియక నీవు సజ్జనుఁడ వగుటచే నిట్లాడెదవుగాని దుర్యోధనుఁడు చక్రధరుని లెక్కఁగొనఁడు. పరాక్రమనిధి యగు నర్జునునకు రాధేయు భుజావిక్రమము సరి యనుకొని వాఁడు రాజ్యమెల్లను దనదే యని గర్వించియున్నాఁడు."

అని పలికి వెడవెడ యలుకవొడమిన మఱియు నిట్లనియె:

"భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలును గర్ణుఁడును మునుపు యుద్ధ మెఱుఁగరా ? ఆశాపాశములు చుట్టుకొని రాగా యుద్ధములు తప్పునా ? ఎదిరిబల మెఱిఁగియుఁ జావఁగోరి మోహాటింతురు. ఇంత కన్న జరుగునది లేదు. కపిధ్వజప్రభలు ధార్తరాష్ట్రుల సంధీభూతులఁ జేయవే ?"

"ముందు మమ్ముఁ బొగిడి, పిదప యుద్ధమున ధార్తరాష్ట్రుల గెలువ నసాధ్యమని నీవు చెప్పినమాటకు నే నొడఁబడను. సంజయా! పక్షపాతము మానుము. గాండీవజ్యారవ ముత్కటమయి తీవ్రముగఁ గ్రమ్మినప్పుడును, భీము బాహాదండ మేపారి శుంభద్గద జడియుచు రౌద్రముగాఁ దోఁచినప్పుడును, వేదండద్వంద్వము మాడ్కి కవలు తాకినప్పుడును, గౌరవులకుఁ జావకుండ బోవవశమే ? కావున రణమునఁ గౌరవులను గెలువరాదనుపలుకు లటుండనిమ్ము. సద్గుణుఁడవగు నీవు వచ్చితివి. ప్రకోపశమముగఁ బల్కితివి. మున్ను పరాభవమొందియు వారి దుర్గుణములు సైఁచుట నీ వెఱుగనిదే ? ఇంకను సహింపఁ గలము. మే మొకరికిఁ గీడుసేయ నొల్లము. దానికి సందియము వలదు. అయ్యకు విచారము గల్గెనేని బాంధవము మరల మొలకెత్తునట్లు, మేము మఱియొక మార్గము ననుసరింపక మున్నె, రండని బిలువఁబంచి, పాలిండని కొడుకులకుఁ జెప్పి, యింద్రప్రస్థమో మఱొక పట్టణమో మాకిచ్చి పుచ్చుట యుచితము."

ధర్మజు మాటలు విని సంజయుఁ డిట్లనియె :

" ధర్మజా! నీ విభవమును, నహింసయు, నీయనింద్యచరిత్ర

మును జాటుచున్నవి. మీ పాలియ్యక కౌరవులు దుశ్శీలతఁ జెడఁ దలఁచి రేని రుధిరాభీలాన్నముకంటె భిక్షాన్నమైనను మీ పడవడికి మేలని నా మతము. రాజసూయ మహాధ్వర మొనర్చి ద్విజులను సురలను సంతృప్తి పరచి శాంతికిని దాంతికిని సకలలోకముల చేతనుఁ బొగడఁ బడిన పుణ్య మూర్తివి నీవు. ఇట్టినీ చరితము హింసాకళంకితమగు టెంతయు నుచితము గాదు. అదియుఁగాక దుర్ణయమున దుర్ద్యూతము పుట్టించి యింత చేసినట్టివారి గర్వముఁ జెల్లనిచ్చి, యడవుల నిడుమలఁ గుడుచుటయు నీ యజాతశత్రుత్వము కతననే కదా? ఇంత చేసి తుదకుఁ గ్రూర కర్మాస్పదమగు మార్గము నవలంబించి యస్థిరమగు సౌఖ్యము నాసించి బంధు గురులను వధించుట యార్యనింద్యము కాదె? 'హాలాహలము' వలె పొంగెడు కోపమును మ్రింగుటలో నీవు నీలగళున కెనయైన వాఁడవు. అల్పుల కది చేదె యగుగాక. అట్టి నీవు గాక మ ఱెవ్వ రోపుదురు?"

సంజయ ప్రత్యుత్తరము

అన ధర్మజుఁడు సంజయుమోముఁ జూచి యిట్లనియె:

"నీవు పలికినది నిజము. కాని యొక్కొక్కప్పుడు కొన్ని కర్మ ములు ధర్మువులట్ల యుండి, బోధకు లరయవచ్చినప్పు డధర్మము లగును. కొన్ని యట్లు గాక యధర్మవర్తనములుగ తోఁచియుఁ దుదిని ధర్మములై పరిణమించును. కావున నన్ను దూఱఁదలఁచితేని నా చేయునది ధర్మమో యధర్మమో నిరూపించి మఱి దూఱుము. కోపమును నివారించుట భావ్యమే. అహిం సయు నుత్తమధర్మమే. అట్లయినను వంశదూషకులును

ధర్మరాజు వాక్యములు

లోకకంటకులు నగు పాపాత్ములను నిర్మూలముగా నశింపజేయుట ధర్మ మని పెద్దలు చెప్ప వినుదుము. అది యట్లుండనిమ్ము. సంగ్రామము రాజులకు ధర్మమగునో కాదో నీవ చెప్పుము. అదియుఁగాక యిది కర్తవ్యము, ఇది యకర్తవ్యమని మనల శాసింప వాసుదేవుఁడు గలఁడు. మన కీ వితర్క మేటికి? ఇతఁడు ధర్మాధర్మవిదులకు గురుఁడు; కార్యాకార్య నిరూపకులకు శిక్షకుఁడు; ఉచితానుచితములకుఁ బ్రదర్శకుఁడు. ఇతని పంపునఁగాదె యదుభోజాంధక వృష్ణిసృంజయ కేకయప్రభృతి భూపతిప్రకరము ప్రశస్తపథమునఁ బ్రవర్తిల్లుచున్నది. విశేషించి మాకు నితని బుద్ధియ సమస్త పురుషార్థములకు మూలమగుట నితని వచన మవశ్య మలంఘనీయము."

అనిన విని జనార్దనుఁడు సంజయున కిట్లనియె.

"నేను పాండవుల సేమమునే కోరుదును. పుత్రపౌత్రమహిమోజ్జ్వలుఁడగు నాంబికేయుఁడును మంచిచెడుగులను గ్రహించినవాఁడు.

శ్రీకృష్ణ వచనములు

అందుచేతనే పాండవులఁ దేర్పగా నతఁడు నిండుమనమున నిన్నుఁ బంపెను. దీనికి నేనుఁ బ్రీతినొందితిని. నీవును నుచితమగునట్లు నెయ్యమును, ధర్మమును, వినయమును గనఁబరచి పాండవులు శాంతినొందునట్లు పల్కుటయు నాకు సంతసముఁ గల్గించెను. ఇది యంతయు చాల పొందుపడినట్లుండినను ధర్మజుని పలుకుల చందముఁ జూడ సంధి కుదరనట్లే కాన్పించుచున్నది. అది యట్లుండనిమ్ము. సంధి యెట్లు కల్గును ? దుర్యోధనుఁ డెట్లు చూచినను నున్మదుఁడే కదా ? ఇంక ధృతరాష్ట్రభూపతి హృదయముగూడ మన

మెఱేఁగినదే. ఆ రాజు సేయు నెయ్యము మిక్కిలి తీపిగ నీవు చెప్పెదవు. కాని పాండవులు దమ పాలు పడయకుండ నేర్పరితనపు మాటలకు తేరనేర్తురే? నీవే చెప్పుము. పాండవులు వెనుకటి విషయములఁ దడవక, యేదో యొక విధమున కొడఁబడి, తేఱి, శాంతులై కౌరవకోటిఁ గూడి మనఁగోరుట కన్న నెక్కువ తాల్మియుఁ గారుణికత్వమును నేమికలదు? న్యాయపద్ధతిని తండ్రిపాలియ్యరని తెంపుజేసి యుద్ధసన్నద్ధులగుట ద్రోహమా? సంజయా! వినుము. అవమానపడియుండి పొంచు పొగడ్తకంటె పరాక్రమముతో యుద్ధమునకు దిగుటయ లెస్స. ఎట్లు చూచినను పాండవులకు యుద్ధమే మేలని నా మతము."

'సంగ్రామము రాజులకు ధర్మమగునో కాదో నీవే చెప్పుము.' అని యుధిష్ఠిరుఁడు నిన్నడిగెనుగదా! ద్విజాతులకు యజన యాజనాది కర్మకరణవిభాగము ధర్మశాస్త్రాచార్యులు విధించునప్పుడు రాజు లిచ్చువారుగాని, వేఁడుకొనువారు గారని చెప్పుట సకలలోక ప్రసిద్ధము. సర్వ వర్ణాశ్రమధర్మ పరిపాలనము సేయునట్టి రాజులు తామే నిజధర్మములను వదలుదురా? అదియునుఁ గాక పాడితోడి యార్జనమునఁ దమకు గల కలిమి యనుభవించుచు సత్పథమున నడచుచుండ, ద మ్మొరు లన్యాయము సేసినయప్పు డుపయోగించుటకు గదా యీ శస్త్రాస్త్రధర్మము లింద్రాదులగు పెద్దలు గావించిరి? నీ చెప్పెడి ధర్మములు గౌరవులకుఁ జెప్పవలదా?

వారలు గదా వెనుక ముందు లరయక దుడుకుపనులకుఁ దిగి చెడు తెరువులకుఁ బోయిరి."

అని పలికి మఱియు నిట్లనియె:

"నాడు సభలో నేవ్వర కట్టెదుర దులువలై ద్రౌపది న ట్లవమా నించుట తగుకార్యమే ? లోకమున జూదమాడరా యేమి?"

అనవుఁడు సంజయుఁడు: "దేవా! దీని నింతగాఁ జెప్పిన సంధి కార్య మెుడగూడు నే ?"

అనిన వాసుదేవుఁ డిట్లనియె:

"ఆ సమయమున భీష్మముఖ్యులగు నచ్చటి వృద్ధజను లెల్ల ధృతరాష్ట్రుని యభిప్రాయము నెఱుఁగనివారై నోరెత్తక యూరకుండిరి. ఆ ధృతరాష్ట్రుఁ డేనియుఁ గొడుకుల దండించి యిట్టి కార్యము వలదని చెప్పఁ డయ్యెను. అట్లు కొడుకుల నాతఁడు వారించియుండెనేని నా చిత్తము కాదు లోకు లెల్లరును సంతసించియుండరే? దుశ్శాసనుఁడు తిట్టుచుఁ బోయి ద్రౌపదిని దలవెంట్రుకలు పట్టుకొని పెద్ద లుండు సభ కీడ్వఁగా మూఁగయై ధృతరాష్ట్రుఁడే యట్లు సహించెను? ద్రౌపదియేడ్పు టెలుంగున కెట్లు లోర్చెను ? ఇవి యన్నియు మఱచి యిప్పుడు నీరి సేమ మారయుటకై యెట్లు పనిచెను ? ఈయకార్యము తగదని సభ్యు లందఱును నడ్డుపడక యూరకుండఁగా ద్రౌపది స్వసంరక్షణము చేసికొగలిగిన దగుటచేఁ బాండవులు బ్రతికిరి గాని యయ్యెడరు రాచ కుమారుల కోర్చునట్టిదే ?"

సంజయా ! అప్పుడు సభాసదులఁ గర్ణశూలము లగునట్లుగాఁ గర్ణుని పలుకులు వినవే :

'నీ కిచట మగలు లేరు. వారలు జూదమున నిన్నోడి విడిచిరి. నీపైఁ గూరిమి గల మగని నొరు నెవనినైన వెదకికొనుము.' ఈ పలుకులు నరునకు వాఙ్మయమగు శరమై హృదయమున నాటి చలింపక దుర్భర వేదనఁ గల్గింపగా నింత కాలమువఱ కేదైన చికిత్స చేసెనేమో నీవే చెప్పుము?"

ఇంతియ కాదు. దుశ్శాసనుఁడు 'వీర లందఱు గొడ్డువోయిన వారలు. పౌరుషము గల మానిసి యిందెవ్వఁడు?' అనియె. అతఁడు చెప్పినట్లు వీరలు గొడ్డువోయిరిగాని వీరి వలనఁ గౌరవుల కేమి కీడు వాటిల్లెను ? మఱియుఁ దత్సమయమునఁ బుట్టిన మాట లుగ్గడింపఁ దగినవి గావు. ఇట్టి పరిస్థితులలో సంధికార్య మత్యంతము దుర్ఘటము. దీని ఘటియింపఁజేయ నవశ్యంబని తలంచెదను. ఐనను పాండవుల నెల్లని వేఁడికొని నేనే యచ్చటికి వచ్చి కౌరవులకు బుద్ధిచెప్పెదను. నామాట విని రాజ్యము పంచుకొనినచో వారు మృత్యుపాశమును దప్పించుకొందురు. అటుపై న్యాయమును నీతియు నడుపుట నాకుఁ దప్పుకాదు గదా ! అన్యాయము కాని నా మాటను వారు మన్నించిన మన్నింతురు. అట్లు గాక యుపేక్షించినచోఁ బాండవబాణాగ్నిని గాదు తమ లోభమను చిచ్చుననే నశింతురు."

అని పలికి శ్రీకృష్ణుఁడు మఱియు నిట్లనియె :

"సుయోధనుఁడు రోషమయ మహాతరువు! అందులోఁ గర్ణుఁడు స్కంధము. సౌబలుఁడు గొమ్మ. దుశ్శాసనుఁడు కుసుమ ఫలము. మూలశక్తి తండ్రి. ధర్మజుఁడు ధర్మతరువు. అర్జునుఁడు ఘనస్కంధము. అనిలసుతుఁడు శాఖ. కవలు పుష్పఫలములు. నేనును భూసురులును, వేదములును, దదీయమైన మూలచయము. ఈ రెంటి యందును నరసి 'యిది యసారము; ఇది గాఢ సారసహితము' అని తెలిసికొనవలయును. ఏది యెట్లున్నను నీర్ష్యయేల? ధృతరాష్ట్రుఁడును వాని పుత్త్రులును వనము వంటివారు. కుంతీనందనులు సింహములు. అసహ్యమైన వనమును ఛేదించుట లోకసామాన్యముగదా? కాని వనావృత వృత్తములు కాని సింహములకు వేగమ కీడొదవును. అట్లు గావున పరస్పరము సఖ్యపడుట యుభయులకును క్షేమకరము. పాండవులు ధృతరాష్ట్రునకు సేవకులై యతని శత్రువులకు దుర్జయులై యుండుదురు. అట్టి వీరిని తన కొడుకులను వలె జూచుకొనరాదా? నే నీ పనికై హస్తిపురమునకు వచ్చెదను. ధృతరాష్ట్రుఁడు సంధికొప్పిన మేలు. అట్లుగాక వేఱువిధముగా జేయదలఁచినచో మేము చేతనయిన కొలఁది చేయువారము. ఈ మాట కౌరవపతికిఁ దెల్పుము."

అనిన విని సంజయుఁడు ధర్మతనయునిఁ గనుఁగొని:

"అట్లయినను గడు లెస్సగదా? దేవా! నా వచ్చినకార్యము సఫలమయ్యెను. పోయివచ్చెదను."

అని వాసుదేవున కిట్లు విన్నవించి భీమార్జున నకుల సహదేవ సాత్యకి విరాట ద్రుపదుల వీక్షించి "మీ యందఱచేత ననుజ్ఞాతుఁడ

గదా? పోయివచ్చెదను. నా యాడినమాటలయం దేమియుఁ దగని యట్టివి లేవుగదా?"

అనుటయుఁ బాండవాగ్రజుఁ డతని కిట్లనియె:

ధర్మరాజు వీడ్కోలు వాక్యములు

"సంజయా! నీవు నయోన్నతుఁడవు. ఎదుటివారి యున్న రూపును నిర్భయముగఁ బల్కితివి. దుర్ణయమును, బెట్టిదమును బెండును నగు పలుకు నీకు రాదు. ఇట్టికార్యములకు నీవో విదురుఁడో చాలుదురు గాని యింత వినయమును నేర్పును గలవా రిం కెవ్వరున్నారు?

"నీవు హాస్తిపురమున కేగినప్పుడు పెద్దలగు విప్రులనెల్ల గాంచి, యాదరమున వారి సేమ మారసి పిదప నాకుఁ గూర్చు వారైన భీష్మ ద్రోణ కృపులకు నా నమస్కరణము గాఁగ నధిక ప్రియభక్తి నమస్కరింపుము. మా తండ్రిని గని దండప్రణామము నాచరించితి ననుము. దుర్యోధనునిసేమ మడిగితినని చెప్పుము. అతని తమ్ముఁ డగుటకు దగు దుస్ససేనునిసేమ మారయుము. తక్కిన కుమారవర్గమును వనితాజనమును నుచితముగ సుఖ మడుగుము. విదురుని శల్యుని గాంచి వినయముదోఁపఁగ నాడుము. ద్రోణ తనయు నక్కనసేర్చికొంటిననుము. బాహ్లికుని సోమదత్తుని భూరిశ్రవసుని దలఁచి ప్రియమునెఱపుము. మఱియు వంశవంతులు, వయోవృద్ధులు నగు భూపతులను, కృతవర్మను, కర్ణ శకుని సైంధవ ప్రభృతులనుఁ దక్కటి రాజలోకమునుఁ, గయ్యమునకుఁ దోడువచ్చిన సకల దేశాధీశులనుఁ గని యెవ్వరితోడ నెవ్విధమున బలుకఁదగునో యయ్యె

ప్రకారములఁ బ్రణామ వినయ బాంధవ మైత్రీ వాత్సల్యములు మద్వచనములుగాఁ బలికి యుచితంబుమెయి నుపచరింపుము. దాసీ దాసజనముల కుదాసీనముగాకుండఁ ద్వరలో మిత్రసంగమున శత్రు నిరాసమొనర్చి తమ్ముని నరసెదననుము. హస్తినాపురము కేగినవెంటనే నీ వందుఁ జేయవలసిన దంతయుఁ జెప్పితిని. దీనిపిదప మా యయ్య కొలువుతీర్చియున్న సమయమున వాయోడక యిట్లనుము:

"అనఘా! భవద్బలంబునన యాపద యించుకయు లేక పాండునందనులు నిజాప్తబంధుసహితముగ సుఖముగ నున్నారు. శైశవంబునన వారి జనకుని రాజ్యపీఠమున సమ్మదమొంద నిల్పి ప్రభుత్వ మిచ్చి తగఁ బ్రోచితివి. అట్టి నీ విప్పు డుపేక్షఁజేసి నిర్దయుఁ డవై పాండవులు దారిద్ర్యము ననుభవించుచుండఁ జూచుట తగునా? ఇంతనే సంతసింపకుము. రాజ్యతృష్ణ కంతము కలదా? మన విరోధుల గర్వ మడఁగునట్లు కూడి మనుట యొప్పదా?"

అని తదవసరమునఁ బితామహునితోఁ నిట్లనుము:

"శంతనుని యన్వయ మడఁగకుండ నీవ కాపాడితివి. ఇప్పుడు కూడ నీ యిష్టముచొప్పుననే పొం దొడగూర్చి పౌత్రులను సడికిని, నధర్మవృత్తికిని, జావునకునుఁ బాలుకాకుండ కాపాడినచో సమస్తజన ములునుఁ, బ్రభువులును, భూసురులును నిన్నుఁ బ్రస్తుతింపరే?"

అని వెండియు

"ఇంతయైనను శాంతిపరుఁడై ధర్మజుఁ డాలము పొంతనైనను బోనొల్లఁ డ"నుము.

ఆ సమయమున నచ్చటివారెల్ల వినునట్లుగా సుయోధనునితో నిట్లనుము :

"బాహుబలాఢ్యుల బలవిహీనుల క్రియ వెడలనడిచిన వెఱ్ఱితనమునుఁ, జిరకాల మడవులనుఁ గొండలను బాధలఁబెట్టిన పరుషదనమును, సభలోన నట్లు పాంచాలినిఁ దలపట్టి యీడ్చిన తులువతనమును ధర్మపుత్రుఁడు సైరించెను. ఇది తథ్యము. ఇందుఁ గురుకుమారులను యుద్ధమున మ్రింగికొనుటకుఁ దలఁపకుమా. ఒరుల సొమ్మునకాసపడఁ దగదు. వారిపాలు వారికిచ్చి వారితోఁగూడి బ్రదుకుము."

"ఏమి కలహ మొల్లక పొందు గోరుట తనకు మేలు. తన మనమున దరికొను తృష్ణానల మార్ప నోరు లడ్డము రాకపోవుటచే నేన బుద్ధి చెప్పవలసివచ్చెను. తనయొద్దఁ గల యోధవీరు లెవ్వ్యేడలను లేకపోవుట తెల్లంబయినను, మాకుఁ జేదోడు ధర్మము గలదు. అదియునుఁ గాక యఖిలలోక సేవితుఁడైన కృష్ణుఁడు మాకుఁ బెనుఁ బ్రాపు గావునఁ మమ్ము గెలువ వారి కసాధ్యము. అది యట్లుండె. నేను భీమసేనాదులకునుఁ దమకునుఁ బెద్దవాఁడ నగుట, వీరును వారును మదీయ ప్రార్థనాభంగముఁ జేయక నాదగు శాంతియు, దాంతియుఁ జెల్లించి, నన్నులజడఁబెట్టక, పోరిత ముడిగి తమతమ ధనములు గుడిచి సుఖముండుట మన పెద్దలకును, దక్కిన బుద్ధిమంతులకును సంతోషమగును. ఎక్కువగా నీయ నోపఁడేని కుశస్థలమును, వృకస్థలమును, వాసంతియును, వారణావతమును జాలును. కాదేని మఱియు నెందేనియు నొక్కటి యగునట్లుగాఁ దన తోడఁబుట్టువు

లేవురకు నిలువ తావు లయిదిచ్చిన సర్వ శాంతియగును. అట్లయిన నిందలి యందలి బంధు మిత్ర సహాయజనములు గలసి, నవ్వుచుఁ దెగడుచు నుండుట యందరకునుఁ బ్రియముసేయును. కురు పాంచాల యాదవ మాత్స్యులు పరస్పర ప్రీతిసంవాదకత్వ సంపన్నులై బ్రదుకుట నా కోరిక. ఇంతయు నమ్మహాపురుషునకుఁ దెలియఁజెప్పుము."

అనిన విని

"దేవా! నీ యానతిచ్చిన మార్గ మంతయు నడపెద. మీ తండ్రికిని నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియమో యట్ల చేయువాఁడను." అనుచు బ్రణామము జేసిన సంజయునకు ధనంజయుఁ డిట్లనియె.

"బాల సఖుఁడవు. నీ తెస్సదనము నాకును, మేము నీతివిడిచి దుశ్శీలురమగుట నీకును శైశవమాది తెలియదే?

"సంజయా! బలమత్తాకృతియైన భీముఁడను శుంభత్కుంభి సంరంభమును ధర్మజుఁడు నాఁడును నంకుశమై నిలిపెను. తుదిని నేఁడును దదుద్రేకము నణఁచుటకు నజాతశత్రుని కృపావార్ధ్య ముండగా వారికి నయవిక్రమోచిత విచారక్లేశమేల?"

అని పలికి ధర్మతనయుఁడు తన యనుమతమున సంజయునకు సపరివారముగా సముచితప్రకారమున మజ్జన భోజనము లొనరింపించి, మాల్యానులేపనా ద్యుపచారములు చేయించి మణిభూషణ చిత్రాంబరము లొసఁగి వీడుకొల్పిన నతఁడును బాండవులను వాసుదేవుని వీడ్కొని చనియెను.

# రాయబారము

## ద్వితీయాశ్వాసము

ఇవ్విధమున వీడ్కొని సూతనందనుఁడు పవనజవంబులగు తురంగములం దఱిమి ప్రొద్దు గ్రుంకునంతకుఁ గరిపురి సొచ్చి నగరి కరిగి యంతఃపురమున నున్న ధృతరాష్ట్రునకుఁ దన రాక నెఱింగించి పుచ్చి, యతనిఁ గాంచి యడుగుల కెఱఁగిన, నమ్మహీవరుఁడును నత్యాదరమున నెత్తి సమీపమున నునిచినఁ గొలిచియుండి చేతులు మోడ్చి యిట్లనియె:

సంజయుని పునరాగమనము

"దేవర పంపఁగాఁ జని యుధిష్ఠిరునిఁ జూచి వచ్చినాఁడను. అప్రమేయ గుణపూజ్యుఁడగు నా భూవరుఁడు మీకు నమస్కరించెను. నను సన్మానించెను. ఇచటి బంధుల నెల్లఁ దలఁచెను. మీ సుఖశ్రీవిభవములును, సుతుల సేమమును బ్రసన్నుఁడై నన్నడిగెను."

అనుడు, ధృతరాష్ట్రుఁ డిట్లనెను.

"అజాతశత్రునకు సేమమే? అతని యనుజన్మ లెల్ల సుఖులే? బంధులు, భృత్యులు, సఖులు, మంత్రివరులు నచట సంప్రీతిమెయి నున్నవారె?"

అనిన సంజయుఁ డిట్లనియె:

"వారెల్లరును భవద్బలమునఁ జేసి సుఖమున నున్నామనిరి. జననాథా! వాస్తవమును బరికించినచో నది నిజముగాదె? ధర్మజు

నకు ధర్మమువలె భోగము లింపుగావు. ధర్మములలో నహింసయెడ నతనికి ప్రీతి మెండు. కురువంశనిధీ! ధర్మజుఁడు మానుషశక్తి యెల్లఁడు. అతఁడు దైవమునె యాశ్రయించియుండును. అతఁడు నీపైన పుణ్యమును బాపమును బెట్టినాఁడు. నీవు నీ సూనునకు వశుఁడవై యుచితమగు విధమును తలఁపవు. ఇంక కార్యనిశ్చయ మా కర్ణ సౌబలాధీనమగుట నిశ్చయము. నీ మతమేమియు నొప్పదు.

"ఆలు బిడ్డలు లేని త్రిమ్మరియగు కొయ్యగాక కుదుటఁగూడు వెట్టి కుడుచువా రిట్టి క్రొవ్విదములు సేయజొచ్చు టిచ్చగించి చూతురే? నృపు లెందైనను నకుంఠితతేజులగు కొడుకులఁ గానరే? ఇట్లు చెడుతెరువున బడ్డచో దగవుసెప్పక యుపేక్షింతురే? కౌరవేశ్వరా! ప్రజ లెల్లరును నిన్ను తిట్టుచుండగా విని మనస్సు నొచ్చుచున్నది. చెవులు చీకులుగట్టినవి. దుస్ససేనుఁడును సౌబలుఁడును మిమ్ముఁ బట్టి యాడింపగా నీవును సుయోధనుఁడును బొమ్మలవలె నాడుచుందురు. తుద కలసి పాండుసుతు లాగ్రహము వహించి యుద్ధమునకు దిగిరేని నీ చలమును, బలమునుఁ గులమును క్షణములో నశింపఁజేయరే?

"కౌరవనాథా! యుధిష్ఠిరుని సైరణను మనవారలు వెఱపుగా సమర్థింతురు. ఇది యొక పొట్టేలు పర్వతమునుఁ దాఁకి కొండ యోడె నని చెప్పినట్లున్నది. అనుజులకు నడ్డుపడి వారి నేమియుఁ జేయనీ కుండుటను నీవును మెచ్చితివి కదా? సాధువుగ నుండువాఁడు రేఁగి నచోఁ దుదముట్టఁ దఱుమక నిలువడు సుమా! అప్పుడు జూదమునఁ

గీడు పుట్టెను. నీ యుపేక్షయె యింతగాఁ జిచ్చువెట్టి కాల్చినది. ధర్మజుఁడు వశీకృతచిత్తుఁడే కాని మెత్తని పులి. ఎల్లరును నీ పయి నధర్మమును మోపుచున్నారు. ధర్మజుఁ డాగ్రహించినచో నతని మరల్ప సాధ్యమే ?

"జననాయకా! నేను మిగుల బడలితిని. ప్రొద్దుబోయె. ఇప్పుడు సెలవు గైకొని రేపు పుత్త్రులును, బంధువులును, నాప్తులును నీవును వినునట్లు మన కార్యమంతయు సవిస్తరముగ విన్నవించెదను."

అనిన 'నట్లకాక' యని సంజయుని వీడుకొలిపి కొంత ప్రొద్దు కురువిభుఁడు కార్యచింతను మునిఁగి, కంచుకి నొకనిఁ బిలిచి వేగముగ విదురుఁ బిలుచుకొని రమ్మని యానతిచ్చెను. వాఁడును సత్వరముగాఁ జని యతని దోడ్తెచ్చిన నమ్మహీవరుఁ డత్యాదరమున విదురుని తనయొద్ద నునిచికొని యతని కిట్లనియె.

ధృతరాష్ట్రుఁడు విదురునితో భాషించుట

"పాండురాజసుతుల పాలికి సంజయుఁ డిప్పుడు పోయి వచ్చి సమ్ముఖమున నన్ను జాల దూఱి, రేపచ్చటి పనులు చెప్పెదనని వెళ్లెను. అప్పటినుండియు నెవ్వగఁ గప్పికొనిన జిత్తవృత్తి గలఁగెడు. మేను నిప్పులఁ బొరలిన ట్లగుచున్నది. నిద్రపట్టదు."

అనిన విదురుఁ డిట్లనియె :

"అధిపా ! బలవంతుఁడు పైనెత్తివచ్చినప్పుడు బలహీనుఁడును, ధనము గోలుపడిన యతఁడును, మ్రుచ్చిల వేచు వాఁడును, గామాకులచిత్తుఁడును నిద్ర లేక కుందుదురు. ఇకొకరగాములలో నేదైన

నీచిత్తవృత్తినొందెనో, యొరులసొమ్మున కాసపడితివో మఱేమో చెప్పుము."

అనిన ధృతరాష్ట్రుఁడు విదురునితో నిట్లనియె :

"ధర్మసుతుఁ డేమనెనో తెలియక యిట్లు చింతిల్లుచున్నాను. నీవు నాయలమటఁ దీర్పజాలుదువు."

అనిన విదురుఁ డిట్లనియె.

"నృపవరేణ్యా! ధర్మసుతుఁడు నీకు బాంధవుఁడును జెలికాఁడును భటుఁడునుఁ బ్రెగ్గడయును గురుఁడును గాఁడె? సత్త్వగుణ సంపన్నుఁడును, శాంతమూర్తియు వినయవివేకశీలుఁడును నగు నాతఁడు కీడు పల్కునే? నీవును సుయోధనుఁడును వారి నన్యాయముగ బాధించితిరి. అదియు చాలును. ఇప్పుడైనను వారికి పాలు పంచియిండు. పిల్లి వట్టిన యీరువువలె జేసిన నెట్లు చెల్లును? మీరు శకుని కర్ణ దుశ్శాసనులమీఁద రాజ్యభారము బెట్టికొని యున్నారు. ఇది తుదిముట్టనేరదు. ఎట్లంటివేని : తమ్ముఁ దా మెఱుఁగుట, వేగపడమి, తాలిమి, త్యాగము, లేని ప్రభుత్వము సాగునే? వారిలో నెవ్వని యందైనను నీ సుగుణములయం దొక్కటియైననుఁ గలదే? యుధిష్ఠిరుఁడు నీవు నిక్కమ తండ్రివని, తగవు నమ్మి, చాల సైరించియున్న వాఁడు. అది నీవ యెఱుఁగుదువు." అనిన విని ధృతరాష్ట్రుఁడిట్లనియె :

"సంజయునిచేతఁ గార్యంపుఁ జందమెల్ల, రేపు తెలిసికొని మన కెద్ది చేయవలయు నది నీవ చేయింపుము. ఇప్పుడు నామనము

దల్లడిల్లుచున్నది. హితభాషణముల దానిని డిందుపఱుపుము. నీవు ధర్మాధర్మవిదుఁడవు. నయానయజ్ఞుఁడవు. నా సంతాప ముపశమించు నట్లు భవద్వచనామృతము నా యుల్లమున వెల్లిగొల్పుము."

అనిన విదురుఁ డిట్లనియెను:

విదురనీతి "రాజా! జనుల కొడఁబాటగువిధమున నడచుచు, లోకనింద్యముల నుడుగుచు, పరులకలిమి కులుకక, యందరతోడనుఁ బొంది పొసఁగి మనుట తగును."

"కౌరవేశ్వరా! కోపమును, తృష్ణపాటును, గర్వమును, నోర్వలేమియు, దురభిమానమును, నిర్వ్యాపారత్వమును కాపురుష గుణములు."

"రాజా! ఏలికను, దైవమును, నాలిని, బంధువులను సముచితారాధన సంశీలతఁ బ్రీతులఁజేయుని పాలసుఁడు శుభముల కాసింప నర్హుఁడు."

"యుక్తాయుక్త విచక్షణజ్ఞానసామాన్యలు నెమ్మిఁగలవారి నొల్లరు; త మ్మొల్లనివారి వెనుకఁ బడుదురు. అధికస్థితి గలవారి నాశ్రయింతురు."

"రాజా! ధనమును, విద్యయు, వంశమును, దుర్మదులకు మదముఁ గల్గించును. సజ్జనుల కడకువయు వినయమును గల్గించును. విలుకాని యుజ్జ్వలశర మొక్కనిమాత్రము నొంచును. తప్పిపోయి నను తప్పిపోవును. కాని నేర్పరియైనవానినీతి, పగతుఁడగు రాజును, నతని భూమినిఁ గూడ జెఱుచును."

"రాజా! వినుము. మధురాహారములు గొనుటయు, పెక్కండ్రు నిద్రఁగూరికొనయెడ మేల్కనియుండుటయు, గార్యాలోచనము సలుపుటయు నొంటరిగానికిఁ దగదు."

"నడవడియును మున్నీటిని గడవఁబెట్టుటకు సత్య మోడవంటిది. దానికి మించిన గుణ మింకొకటి కలదే.?"

"క్షమియించువానిని గని శక్తిహీనుఁడందురు. ఐనను క్షమయే నిజమగు భూషణము. ఖ్యాతిని గోరినవారే దానిని దాల్తురు."

"పరుసములు పలుకకుండుటయు, పాపకార్యములు సల్పకుండుటయు నుత్తముల గుణములు."

"కురువరేణ్యా! చెల్లియుండియు సైరణ చేయునతఁడును, పేదవడియును నర్థికిఁ దనకుఁగలిగినంతమట్టుకుఁ బ్రియముతో నిచ్చునతఁడును పుణ్యపురుషులని యార్యులు చెప్పిరి."

"న్యాయార్జితమగు విత్తము నపాత్రుల కిచ్చుటయు, పాత్రుల కీయకుండుటయుఁ జేటు పుట్టించును."

"వెలఁదియు, జూదమును, మద్యపానమును, వేఁటయు, పలుకు ప్రల్లదమును, పరుషమగు దండమును, నిష్ప్రయోజనముగ సొమ్ము వమ్ముసేయుటయు నివి సప్తవ్యసనము లనఁబడును. వీని నవలంబింప జనదు."

"తన స్థితికిఁ దగిన వేషమును, తనుఁదాన పొగడుకొన కుండుటయు, నొచ్చియునుఁ గీడు పలుకకుండుటయు, నిచ్చి వగవకుండు

టయు, తానెంత పేదరికమం దున్నను న్యాయము తొలఁగకుండు టయు, సత్ప్రవర్తన మనిపించుకొనును."

"చెలిమియు, సంభాషణమును, బలిమియు, వివాదమును తమకు సమానమైనవారితో జెల్లునుగాని కులహీనులతో సరిపడదు."

"నరపాలా! కొంచెమైననుఁ బంచికొని కుడుచుట మేలు. పనులయెడ దుఃఖమోర్చి యల్పసుఖము ననుభవించుటయే హితము. అడిగిన శత్రునకునైన నిచ్చుట లెస్స. ధర్మనందనుఁ డీ ధర్మములను పాటించువాఁడు."

అని పలికి విదురుఁ డతి ప్రసంగముగాఁ బాండవులఁ బ్రశంసించి "నీవు వారలఁ బెంచి పెద్దజేసి రక్షించి, యిప్పు డుపేక్షించి వారలు వెలినుండ నూరకుండఁ దగునే? తగు పాలిచ్చి వారి రావించి నీ కొడుకులతోడివారిగా భావించుట యనుమతము. మీరును వారు నొక్కటియై యున్న దేవతలకైనఁ దేఱి చూడరాదు." అనిన నమ్మా టలు వెడవెడ యాకొని ధృతరాష్ట్రుఁడు విదురున కిట్లనియె:

"హితమునుఁ గర్తవ్యమును నీ వెఱుఁగుదువు. ధర్మసుతు చంద మును నీకు విదితము. అందుచే నా చిత్తతాపోపశమ మగునట్లు కార్యస్వరూప మంతయుఁ జెప్పుము."

అన విదురుఁ డతని కిట్లను:

"విమలవిచారా! ఇవ్విధమున నన్నార్తియడిగినఁ జెప్పక తప్పదు. అవధానముతో వినుము."

"రాజ్యముదక్క నదియు చాలునని తమ్ముని భాగమియ్యక నీ వొంటరిగ మ్రింగఁజూచెదవు. అది యెట్లుగును? ఆమిషము చవిని లోలతచే మీను గ్రక్కున గాలము మ్రింగిన ట్లున్నది. ఇంతవును నుక్కువుఁడైన నీకొడుకు నుల్ల మిట్టిది. నిన్నిటులాడి యేమి లాభము?"

అన విని ధృతరాష్ట్రమనుజేంద్రుఁడు నిరుత్తరుఁడయి కొంత సేపు న్నూన్పడి తలఁపులు పెనఁగొన నిద్రలేమిఁ దను వలయఁగ విదురునితో నిట్లనియె:

"ఇందాక నీ పలుకులచే డెందము తాపము గొంత డిందు పడెను. సౌజన్యనిధీ! నాకు నయానయముల చందములు చెప్పు చుండుము."

అనిన విని విదురుఁ డిట్లనియె:

"కమియ బండకుండఁ గాయనుగోసిన రుచి చెడుటయేగాక విత్తునకుఁ జేటుగలుగును. పక్వమైనపిదపఁ గోసిన ఫలమూ లభించును, బీజమూ చెడదు. కార్యసిద్ధి చందమును నిట్టిద."

"మాలకరి పుష్పములు గోయునట్లును, తేఁటి పువ్వుఁదేని యనుఁ గ్రోలెడిరీతిని, నెదిరి కందకుండఁగఁ గార్యఫలము గొనునది. బొగ్గులకునై చెట్టును నఱుకుదురె?"

"అధిపా! పరుల ధనమును, విద్యాపరిణతిని, తేజమును, బలమునుఁ జూచి యసహ్యపడువాఁడు దెవ్వులులేని వేదనఁబడును."

"ఎదుటివారికి హితమును బ్రియమునుఁ నింపునుగాఁగఁ బలుకుట లెస్స. అట్లుఁ గానిచో నిది యది యనక యూరకుండుట యుక్తము."

"కురువంశనిధీ! కత్తినఁగాని గొడ్డలినఁగాని నఱికిన మ్రాను చిగిర్చిన చిగుర్చవచ్చును. కాని పలుకులచే జెడదునిగిన కార్యము పిదప నెవ్విధమునను నిగుడనేరదు."

"అధిపా! తనువున విఱిగిన యమ్ములు ననువునఁ బుచ్చవచ్చును. కాని యతి నిష్ఠురతమెయి మనమున నాటినమాట లెన్ని యుపాయములనైనను వెడలునె?"

"కౌరవేశ్వరా! ధర్మనందనుని నోట నొకనాఁడైననుఁ గీడు పలుకొక్కటి వచ్చెనే? నీ కొడుకు లొండొరు మీఱి పెక్కునికృష్ట వాక్యములు పెక్కుభంగులఁ బ్రేలుచుండ నూరక వినుచుండెదవు. ఇది నీకు తగునే?"

"చేటుకాలము వచ్చినప్పుడు చెడ్డమాటలును, నెఱిఁగాని తెరువును, వట్టికార్యములును నుచితములట్లు తోఁచును. యోగ్యములయోగ్యములుగఁ గన్పట్టును."

"నీ బుద్ధి పాండవులతోడి విరోధమునెడ మరలకుండుట పాపము కాదె? ఇంతియకాక యేమి సేయుదము? మన కులమునఁ దేజోధైర్య ధార్మికత్వాదిగుణముల గరిష్ఠుఁడైన యుధిష్ఠిరుఁడు నీ సిరికి వెలియై యట్లుండుట దగవగునే? నీపెద్దతనము జూచి సైరణ

జేసి యున్నవాఁడు." అనిన విదురుదిక్కు మొగమై ధృతరాష్ట్రుడు :
"నీచెప్పిన నీతివాక్యముల నా మనము దనివోవదు. ఇంకను చెప్పుము."
అనవుడు నతఁడు వెండియు నిట్లనియె :

"సకల పుణ్యకర్మచయమును నొకదెస, పాడి దప్పకుండుట యొకటి దిక్కని శ్రుతులు తెలిపెడు. పాడి కలిగినచో నిహలోక ఫలము లెల్లఁ గల్గుటయకాదు; కీర్తియు లభించును. భూలోకమున నెంతకాలము కీర్తి నిల్చునో యంతకాలముఁ బుణ్యలోకము గల్గు నందురు. తొల్లి ప్రహ్లాదుఁడు దైత్యజాతి సంభవుఁ డయ్యును దన కొడుకు విరోచనుఁడును, నంగీరసుఁడును విప్రకొడుకు సుధన్వుఁడును దమ తమ ప్రాణము లొడ్డుగా నొడ్డి యొకట ధర్మసందేహమునకుఁ బన్నిదము సఱచి వచ్చి తన్నడిగిన, నితడు కొడు కితఁడు లాఁతి యని తలఁపక మధ్యస్థుఁడై సుధన్వ గెలిపించి యతనిచేత నిజతనయుని జీవితము దానముగాఁ గొని వానిని బ్రదికించెను. కావున నీవును ధర్మము విడువక యధర్మోపేతులైన నీ కొడుకుల వలని పక్షపాతము విడిచి న్యాయమార్గము ననుసరింపుము. వారును వీరును నాపదలేక బ్రదుకుదురు; నీవును శోకములేక తనుకుదువు." అని చెప్పి మఱియును :

"పాపములు కర్జములని చేయ నవియు నింపగును. ధర్మ వ్యాపారములకార్యములై పరిణతిఁ బొందెనేని యవి యట్లే కాన్పించును.

"ఆర్యులు లేని సభయు నొక సభయే ? సముచిత ధర్మము

పలికిని యార్యులార్యులే? సత్యము కానిది యార్యులు పలికిన దైనను ధర్మమగునే?

"నీతిపథమున బ్రతుకనేర్చుట యుత్తమభంగి. శౌర్యసంజాతములైన సంపద లొందుట మధ్యవృత్తి. గౌరవహీనమగు భారవాహియగు జీవనము కనిష్ఠము. నీతికి బాహ్యులైన వారిని నుత్తములు మెత్తురే?

"నీ పుత్రులెల్ల కయ్యమున కెప్పుడును కాలుద్రవ్వుదురు. వారి మంత్రు లంతకు ముందరస బిరుదు మగలు. ఇంక నీవో నీతిమార్గము ననుసరించవు.

"పాండవులు శౌర్య మొల్లరు. నీతిని మెచ్చుదురు. ఎదురేచి నచోఁ దుదిని మండుదురు. అప్పు డెవ్వరికిని నా మంట నార్ప నశక్యమగును.

"పాండవులు తమతండ్రిని వలె నిన్నును భక్తిశ్రద్ధలతో సేవించువారు. నీవు వారినిఁ గన్నకొడుకుల వలె జూచుకొనుము.

అని పలికి మఱియు నిట్లనియె:

"రాజా! కారణము లేకయే యుపకారపరత్వమున నొరుల కార్యములకుఁ దోడ్పడువారు పాండవుల కేడుగడలై యున్నారు.

"కురువంశ వర్ధనుఁడవగు రాజా! ఒకని చేతిప్రోపును, ప్రాపును, నున్నతియుఁ బడసి యాతనికే కీడుదలఁచిన కృతఘ్నుని పీనుఁగునైన రోతపుట్టక కబళింపఁ గుక్కలు నోడఁబడునే?

"కావునఁ గృతముఁ దలంపమి గీడు. పాండురాజు నీఁకు బరమ భక్తుఁడు. పాండవులు తేజోలాభములఁ గాంచిన వారు. వారల నాదరింపుము."

అని చెప్పి వెండియు నిట్లనియె :

"జీవిత మరణములు, భూషణ దూషణములు, యజన యాజనములు, సుఖ దుఃఖములు నెడనెడవచ్చును. వాని కింత వగవనేల ?

"దుఃఖముచే బలము దఱుగును. చేటు గల్గును. బుద్ధి చెడును. తెవులు వచ్చును. మిక్కిలి వగచి నలఁగినఁ బగతురకు బ్రియమగును. అందుచే మహారాజా ! వగచుట యుడుగుము."

అనిన ధృతరాష్ట్రుఁ డిట్లనియె :

"రిత్త యగు నపచారవాక్యములచే నే నుత్తముఁడగు ధర్మ తనయు నుడికించితిని. దుర్వృత్తులగు మత్సుతులకు యుద్ధమున మృత్యువగును. కలహములచే దుఃఖము పుట్టదా ? అందుచే దుఃఖ నివారక మెద్దియో దాని నెఱిఁగింపుము."

అనిన విదురుఁ డిట్లనియె :

"కౌరవేంద్రా ! నియత తపమును, నింద్రియ నిగ్రహమును, విద్యయు శాంతికి కారణములు. వానికంటె లోభ ముడుగుట మేల యిన శాంతికారణము.

"మానవేంద్రా ! జ్ఞాతులతో జగడ మాడరాదు. గోత్రాతము

నాక్రమించుకో దగదు. విప్రవర్గమునకుఁ జన వీయఁగూడదు. నాతులఁ గారింపఁజనదు.

"అలమికొని యొండొరుల ప్రోపులను బ్రాపులను నెలమి కలిమిఁ బొంది జ్ఞాతులు పెక్కురు గూడి యున్నప్పుడే దామరకొలని వలె సిరి కాటప ట్టగుదురు.

"ఒంటియున్న తరువును కరి తురగాది ఘట్టనయును గాలి యును నొంపదె? అట్లుగాక యనేక భూరుహావితానము గుంపయి యున్నచో నుపద్రవముగల్గునే? అట్లే యన్నదమ్ము లొద్దికగా నున్నచో నెట్టి వారికిని యసాధ్యులగుదురు. అట్లుగాక నిల్చినచో కెలని కెల్లిదమై యెంతయుఁ బరిపోదురు.

"కావునఁ గౌరవులును బాండవులును నొండొరులకుఁ బ్రాపై పోరుడిగిన నెదిరికి నజేయు లగుదురు. పరుల యొత్తిడి లేని రాజ్యము పూజ్యమహిమను బరఁగును. వనవాసమునఁ గుందిన కౌంతేయులను తడయక తెచ్చి యుచితపద మిచ్చి నిలుపుట, నీకొడుకులకు సేమ మొదగూర్చుట యగును." అని చెప్పి మఱియు నిట్లను:

"ప్రియవాదు లెందును గలరు. అప్రియమగు గా కేమియని పథ్యము పలుకువారు లేరు. జూదమునప్పుడు నే నడ్డపడి, యప్రియ మగుటకు శంకింపక న్యాయము పలికితిని. అది నీకు రుచింపక, రోగికిఁ బథ్యాహారము దల కంటగించు నట్లయ్యెను. ఐన నిప్పుడుఁ జెప్పెదను వినుము, శాకములఁ గైకొని మధురాఢములఁ బరిహరించు

విధమున, మార్జాలముల బాటించి సింహముల యెడ ననాదరము సేయు విధమున సుయోధనాదులను బట్టి యుధిష్ఠిర ప్రముఖుల విడిచితివి. నేఁడు కార్యము వచ్చినప్పుడు దోఁక మిడుంగుఱు సోఁకినట్లు తల్లడించెదవు. కులమునకై యొకని దొరంగుటయు నీతి యని పెద్దలు చెప్పుదురు. దుర్ణయపరుఁడై సద్బుద్ధి చెప్ప వినఁడేని మనము దుర్యోధనుని దొరఁగిన నేమియగు? అది యట్లుండె. సంపద సహాయము నపేక్షించి యుండును. సహాయము సంపద నుద్దేశించి వర్తిల్లును. ఇట్లొకటొకటి పొత్తునఁ గాని సిద్ధింపవు. కాన నీ సంపద పాండవులకును, వారి సాహాయ్యము నీకును ప్రియంబొనరింప నొందురుల కలయిక మేలు గాక మన లావు వెలిసేయుట లెస్సయగునే? కురువంశ విస్తారకులగు భీష్మయుధిష్ఠరులును, నయ విక్రములగు కర్ణార్జునులును, ప్రతాపధాములగు భీమ దుర్యోధనులును, శస్త్రాస్త్రపారగులగు నభిమన్యు లక్ష్మణప్రభృతి కుమారులును, శాపానుగ్రహ సమర్థులగు ద్రోణ, ద్రుపదాది పరమాప్తులును వారి వారి బంధు మిత్ర జనములును, నొక్కుమొగమై నీపనుపు సేయుచు నయవిక్రమము లప్రతిహతములై యుండ, పృథివి శాసింప భవదీయ విభవ ముజ్జ్వలమై యొరుల కెడలేక చెల్లుచున్న నెంత యొప్పగునో విచారింపుము. పాండవులు ధీరమతులై వైరమెత్తక యూరక తొలఁగి యుండరేసియుఁ గతిపయ దినములలో జీకాకుపడి చెడునుగాక గాంధారనందనునిచే వసుంధరా పరిపాలన భారమునిర్వహింపబడునే?" యనిన విని ధృతరాష్ట్రుఁడువిదురునకిట్లనియె:

"నీవు చెప్పిన మాటలు నిర్మలములు, నిపుణ సమ్మతములు, రాజనీతి మార్గబోధకములు. ఐనను బుత్త్రు విడువనోపను. ధర్మో జయతి యని యుండువాఁడను."

అనిన విని విదురుఁ డిట్లనియె :

"దేవా ! జ్ఞాతులు గుణహీనులైనను విడువఁదగరనిన, సకల గుణసంపన్నులై భవత్ప్రసాదముఁ గోరుచున్న కౌంతేయులను దిగ విడువదగునే ? ఏను నీకు హితము గోరెడువాఁడనని నిశ్చయించి నా బుద్ధి వినుము. వారి జీవనమునకుఁ గొన్ని యలంతి పల్లియలైనను దుర్యోధను నోడఁబఱచి యేర్పఱచి తెఱఁగు పఱచిన లెస్సయని నామతము. అతని విడువవలయునని చెప్పితినేని యుద్ధమున బశ్చాత్తాపము పుట్టును. దాని కప్పుడు ప్రతీకారము లేదు. కావున నెల్ల భంగుల నియ్యకొని పాండవులతోడ సంధి చేయవలయును. అట్లుగాక చావవలెనన్న పరస్పరము పాళ్ళకొఱకు సమరము చేయవలెనే ? శరీరము లాధి వ్యాధి జరా సమన్వితములగుట మృత్యువు సహజము.

"గజతురగాది సంపదలు గలిగి, ప్రజానురంజకమగు పరిపాలన మొనర్చి విజయశీలురై, సమస్తభోగభాగ్యము లనుభవించిన రాజులు మరణించక నిల్చిరే ? కావునఁ జెవికిఁ జేదైనను నామాట వినినచో నిహపర శ్రీవిభవములును గీర్తియును గల్గుట నిజము. మఱియొకసారి యూహించుకొనుము. ధర్మతనయు నెట్లైనను దిగవిడువకుము. ధృఢమతివై కొడుకులకు బొందగు చందము జెప్పుము."

అనిన నాంబికేయుఁడు :

"నీ పలుకులను గలఁకఁదేఱి బుద్ధి తెలవి నొందెను. ఇట్లె చేయువాఁడను. కార్యమును, ధర్మమును, యశమును, లాభమును, గూడ నిదియ."

అనుడు ముదమును, నమ్మమియు నాత్మఁ బెనఁగొన సన్న తోఁడ విదురుఁ డిట్లను :

"పెద్దవడికి నీ మనస్సు కార్యవృత్తి మాలొ్కనియె. సుయోధనుని జూచి యకుంఠితమగు నిశ్చయముతో నతఁడు వ్రాలిన వెనుకు వ్రాలకుండినచో మముబోఁటులకుఁ బ్రియమగును."

అని పలికి నిట్టూర్పు నిగిడించి

"దైవము నేర్చుగాక, ఇటు పోవనేర్తును, యిటు పోవనేరను బొమ్మని నరునకు పలుక వశమె? ధరణీనాథా! పౌరుషముకంటె దైవము యధికము."

అనిన విదురునకు వైచిత్రవీర్యుఁ డిట్లనియె :

"ధర్మపథమును నీతితత్త్వము తెరువును నిర్మలమైన నీ పలుకులచే నాకు దెలియఁజెప్పితివి. ఇంక పారమార్థకదృష్టి యెట్లుకల్గునో చెప్పుము."

అని యడిగిన విదురుఁ డతని కిట్లనియె :

"నాకుఁ దోఁచిన యన్నియు నా నేర్చినట్లు నీకెఱింగించితిని.

అత్యంత గుహ్యములగు నర్థాదులు పురాణుఁడయ్యును గుమారుఁడగు సనత్సుజాతుఁడు తెలుపనోపును గాని యిటమీఁద నాకుఁదెలియదని" న ధృతరాష్ట్రుఁడు "అమ్మునీంద్రుఁడు నా కెంతదవ్వున నున్నాఁడు. నీవ యవియునుఁ జెప్పుమా." అనిన విదురుఁడు "నేను శూద్రుడను వేదాంతవేద్యములగు నర్థములు నా కగోచరములు. అమ్మహాత్ము బుద్ధి నే నెఱుఁగుదును. దేవతలకుఁ దెలియనట్టివి యాతనికిఁ దెలియును. అతఁడ దెలుపఁజాలును" అనిన ధృతరాష్ట్రుఁ డతి కుతూహలుఁడై "మనకు నిప్పు డతనిఁ గను తెఱఁ గెఱుఁగను" అనిన విదురుఁ డాశ్రితవత్సలత్వనిధియగు సనత్సుజాతు నాత్మలో దలఁచెను. ఇట్లు దలఁచుటయును దివ్యజ్ఞానమాననీయుఁడగు నమ్మునివరేణ్యుఁ డాక్షణంబ పొడచూపిన, విదురుఁ డతని వచ్చుట యుగ్గడించుచు, వినయమున నతని నెదుర్కొని దండనమస్కారము లాచరించి యున్నతాసన మిడి, యర్ఘ్యపాద్యము లిచ్చి, ససంభ్రమముగాఁ బ్రత్యుత్థానమును బ్రణామమునుఁ జేసియున్న ధృతరాష్ట్రుని యతనికిఁ జూపి విదురుఁ డిట్లనియె :

సనత్సుజాతుని తత్త్వోపదేశము

"దేవా ! దేవరవారి కృప నీ భూవల్లభుఁడు తత్త్వబోధకములై సౌఖ్యావహములగు వాక్యములను వినగోరుట చే మిమ్ములను భక్తిమెయి దలఁచితిని. మీరును గారుణ్యాతిశయమున విజయము చేసితిరి. గురుసమాశ్రితులగు వార లెద్దాని వలన సుఖదుఃఖములు, లాభాలాభములు, ప్రియద్వేషములు నాదిగాఁ గల ద్వంద్వములఁ బడక బ్రదుకుదురో యట్టి పరమార్థోపదేశమున నితనిఁ గృతార్థునిఁ

గావించి రక్షింపవలయును.” అని ప్రార్థించిన బార్థివుఁడును దదను రూపములగు బలుకుల నారాధించినఁ బ్రసన్నుఁడై సనత్సుజాతు డధ్యాత్మవిషయములగు వివిధవాక్యముల సోపానప్రకారమున నంత కంతకు సూక్ష్మములగు నర్థముల సమర్థించుచు, నందుఁ బ్రజ్ఞాచక్షుఁ డెయ్యది యేర్పడ నడిగె నది యెల్ల వివరించుచు హృదయ పుష్కర కలితమగు పరతత్త్వము ప్రసాదించునట్టి గూఢోక్తులను గ్రహించు చుండ, నెట్టకేలకుఁ బ్రభాతమగుటయు, ధృతరాష్ట్రవిదురుల నామంత్రణముచేసి య ద్దేవముని యంతర్ధానమునొందెను.

ఇంతలో తెల్లవాఱెను.

## 3

సభలో సంజయుని వాక్యములు

ఇట్లు సూర్యోదయ మగుటయు ధృతరాష్ట్రుడు దత్కాలోచి తాచారములు నిర్వర్తించి, తగు తెఱఁగున నలంకృతుడై యాస్థాన మండపమున కరిగి పేరోలగంబున్న కుంభసంభవ కృప కృతవర్మాశ్వత్థామ కర్ణాదులగు దొరలును, భీష్మ విదుర బాహ్లీక సోమదత్త భూరిశ్రవస ప్రభృతులగు బంధుజనులును, దుర్యోధన దుశ్శాసన ప్రముఖులగు కుమారులును లోనుగాఁగల సమస్తపరిజనములును వచ్చి బలసి యుండిరి. అయ్యవసరమున సంజయుఁడు వచ్చి వాకిట నిలిచి పణిహా రులవలనఁ దన్నెఱిఁగించి పుచ్చి వచ్చి సముచిత ప్రదేశమునఁ గూర్చుండి, తనమాటలు వినుటకుఁ జిడిముడి పడుచున్న కొలువు నలుదిక్కులఁ జూచి యిట్లనియె :

"ఏ నుపప్లావ్యమున కేఁగి తొలుత వాసుదేవార్జునులఁ జూచితిని. వారు నీతిపథము దప్పని మాటలు బలిమిఁ దోచునట్లు నాడిరి. చెప్పెద వినుఁడు."

అనిన విని ధృతరాష్ట్రుఁడు "అ వాసుదేవుచిత్తం బెట్లున్నది ? అతఁ డేమనియెను ?" అని యడిగిన నతనికి సంజయుఁ డిట్లనియె :

"అ మ్మహాత్ముని హృదయమున నీదెసకూర్మి యెట్టిదో కాని తానును నరుఁడును సత్యభామాద్రౌపదులును రహస్యగోష్ఠీ నిరతాత్ములై సుతులు సైతము చొరని కాంతానివహముతో నుండిన చోటునకు నన్ను బిల్పించెను. ఏనును దత్ప్రకారము పణిహారులవలన మున్న యెఱిఁగినవాఁడ నగుటఁజేసి గంచుకమును శిరోవేష్టనమును ధరించి వినీతవేషుఁడనై పోవునప్పుడు కృష్ణార్జును లనేక మణిమయ భూషణ ప్రభాభాసితులై యొక్కసెజ్జన యున్నవారు. కృష్ణుఁడు పవ్వళించియుండి చాఁచిన చరణములు దొడలపై నిడికొని యర్జునుఁడు గూర్చున్నవాఁడు. సత్యభామయుఁ బాంచాలియుఁ గద్దియలపై నున్నవారు. సవినయముగా నేనును దండప్రణామము చేసిన నన్నాదరించి, కృష్ణుని చేసన్న నర్జును పనుపునఁ గనకరత్నమయమగు నతని పాదపీఠమున నతఁడు వ్రేల్చిన కాళ్లు దిగిచికొన, నిద్దఱు ముద్దియ లెత్తి తెచ్చి నాకుఁ బెట్టిన, నేనును దానిని గరతలమున నంటుచు ధరణీతలమునఁ గూర్చుండి, కేలుమొగిడ్చి ఫాలతలమునం గదియించి నీలవర్ణులు బాహుబలమదభరితులును నయి యేనుఁగుదోయియుం బోలె నున్న య మ్మాధవధనంజయులఁ జూచునప్పుడు నాకు హర్షాశ్రు

పులకలును, దదనంతరంబ భయమునుఁ బుట్టెను. అంత నమ్మ హానుభావులు నన్ను సంభావించి తా ముపయోగించునట్టి యన్నపాన ములను, దమకుఁ గట్టఁదగినట్టి వస్త్రములను, దాము దొడుగునట్టి భూషణములను నాకుఁ బ్రియంబొనర్చి గారవించిరి. నేనును నా పోయిన కార్యము విన్నవించితిని. విజయుఁడు బలుమొగముతో దానికి నుత్తరము వలుకఁ దొడంగిన వారించి వారిజోదరుఁ డిట్లని యెను :

సంజయుఁడు ధృతరాష్ట్ర నకుఁ గృష్ణుఁడుచెప్పిన మాట లెఱిఁగించుట

"సంజయా! ధృతరాష్ట్రవిభుని పెద్దకొలువు నందుఁ దత్పుత్త్రిలు, గురుఁడును, గృపుఁడును, భీష్ముఁడును మొదలైన సకలజనులును వినుచుం డఁగా నిట్లనుము.

'అజాతశత్రుఁ డలుగుట నీళ్లల నగ్నిపుట్టి నట్లయ్యెను. మీరు దాని నార్పలేరు. కావున మీరు నేర్పుతోఁ జేయవలయు పనులను వినుఁడు :

"ఉన్నధనమంతటిని సత్పాత్రదానము సేయుఁడు. చెలులను జుట్టములను నాశ్రితులను రావించి సత్కరింపుఁడు. ఇచ్ఛానుగుణ ముగ నింద్రియసుఖము లనుభవింపుఁడు. ఆండ్రను బిడ్డల నయ్యైవిధ ముల గారవింపుఁడు. మీ వాంఛలను వెంటనే తీర్చుకొని యటుచేతఁ బ్రాణము లుంచుకొని యుండుఁడు" అని చెప్పుము. ఇంత యేమిటి కంటివేని పడరాని పాట్లుపడి ద్రౌపది దవ్వులనున్న నన్ను 'గోవిందా! కావుము' అని పలవించుట నాకు తీర్చరాని యప్పైయున్నది. అందుచే

నేను తేరు నడిపింపగా గిరీటి గాండీవ మెక్కుపెట్టి నేఁడో రేపో యునికి వచ్చును. మీ రెట్లు తప్పించు కొందురు ?"

అని పలుకునప్పటి హరి యెత్తికోలును, నీ కొడుకు విడుపోవ ఎయును దలఁచి భయమందితిని. ఇతఁడు వారల నెఱుఁగఁడు. భీష్మద్రోణుల ప్రాపును, కర్ణు గర్వమును దన్ను గెలిపించునని నమ్మి యున్నాఁడు." అనిన విని ధృతరాష్ట్రుఁడు "అర్జునుఁ డేమనియెను ?" అని యడిగిన నతనికి సంజయుఁడిట్లనియె :

"నరేంద్రా ! నరుఁ డలుక పొడమియు సుస్థిరుఁడై మానని గాయమువలె నెఱ్ఱనై గెందామరలవలెను నున్న తనకన్నుల నరుణచ్ఛవి నిండగా నిట్లనియె :

"సంజయా ! సుయోధనుఁడును, నతనికిఁ దోడ్పడవచ్చిన రాజులును వినుచుండ నావచనములుగా నిట్లనవలయును :

'ధర్మజుఁడు పాలడుగ సుయోధనుఁ డీయ నిరాకరించినచో నది మేల' పొగరుచే మున్ను తాను చేసిన దుష్కార్యములకు మెఱుఁగుపెట్టి నట్లుండును. నేనును వృకోదరుఁడును బ్రియ మందుము. మా యిరువురితో దుర్యోధనుఁడు కయ్యము పెట్టుకొనినచో ధర్మజు కార్యసిద్ధి యగుట నిజము. అంపశయ్యను దుర్యోధనుఁడు రణక్షోణి బడక తక్కినచో వనవాసమున భూశయ్యను ధర్మజుఁడున్న యాయాసము పోవునె ? సత్యమును నమ్మి యవమానములను మనస్సున నుంచక లోన నడఁచి యుంచినట్టి కోపానల మొండియున్న

నిబిడాటవిపైఁ బ్రసరించు తీవ్రదావానలము వలె శాత్రవులపై గవియించి నిల్చినగాని ధార్తరాష్ట్రులు యుధిష్ఠిరుని సరకుగొనరు. అంత్యకాల విచలతాకరాళాకృతియై భీముఁడు గదసారించుచు నున్మత్త మాతంగచయము నుగ్గుసేయుచు, రథవ్రాతమును చదియుచు, హయవ్రజమును పొడిగావించుచు, సంరంభతుంగాంగుఁడై కదియఁ జూచి సుయోధనుఁడు రాజ్యభాగ మిచ్చును. క్రోల్పులి లేళ్లకై యుఱుకునట్లును, పెనుగాలి జీమూతబృందముపై వీఁచునట్లును, నాకొన్న లయరుద్రుఁడాగ్రహమున జగత్ప్రళయము మూట్టునట్లును సాత్యకియు నకులుఁడును నభిమన్యుఁడును, నెదిరినబలము నెల్ల నట్టిటు చేయఁజూచి కౌరవులు సంధి కిచ్చగింతురు. అప్రతిమ వీరులగు ద్రౌపదేయ లేవురును సింహకిశోరములు మదోన్మత్త గజావళిని దరియునట్లరాతిబలమును ముట్టి నెత్తురు నీటఁ దేల్చినఁ గాని కౌరవులు సంధిచేయరు.

'అచ్యుతుఁడు బాలక్రీడ మహాసుర ప్రకరమును భంజింపఁడే? అతనిని త్రిలోకములు నారాధించుట లేదె? అట్టి మహాత్మునే సుయోధనుఁడు సరకుసేయఁడు. మే మతని కొక లెక్కయా?

'మేము పితామహ గురుకృపాచార్యులకు నమస్కరించి యస్మదీయ రాజ్యభాగమునకై తొడరి కయ్యము సేయువారము. కౌరవుల పక్షమున నెవ్వరేని మాతో యుద్ధము చేసినచో వారి శస్త్రాస్త్రములు ధర్మప్రతిహతములగునని తలచెదము. పండ్రెండు సంవత్సరములు వనమున నట్లిడుమలఁ బడి, జనపదమునఁ బదుమూఁ

కవయే డజ్ఞాతవాసాయాస మట్లనుభవించి వచ్చి, మా తండ్రి పాలికై యుద్ధము చేయు మమ్ము నింద్రాదిసురసహాయులయ్యును ధార్తరాష్ట్రులు గెల్చువారై రేని ధర్మముకంటె నధర్మము బలవంతమైనది యగును. ఇంతియ కాని మా చేయునది గీడైనది గాదు. మేము వాసుదేవుని మున్నిడుకొని నడతుము గావున నీ యుద్ధమున జయము మాకు సిద్ధము. ఎట్లైనను గర్ణసహితముగా గాంధారీనందనులను మనిమి యేము భూమిగొనుట తప్పదు. గాండీవము దివియకయును గుడుసువడియెడు. బాణములు దమయంతన తూణీరము వెడలెడు. తోలూడ్చు మహానాగమునుం బోలెం గరవాలము దాని యొఱవెలికి సిగుడుచున్నయది. కావున మా కవశ్యము సంగరము సంభవించును. పాశుపతాది దివ్యశరములచే గురుపక్షప్రజాక్షయము చేసి శాంతిం బొందెదము. సూతనందనా! నీవు సుస్థిరుండవై యింతయుం దెలియం బలుకవలయును. ఇమ్మాటలు విని కురువృద్ధుండగు బాహ్లికుండును పితామహుండగు భీష్ముండును గురుండగు కుంభసంభవుండును, శిక్షకుండగు కృపాచార్యుండును, గురుపుత్త్రుండగు నశ్వత్థామయును, సద్బుద్ధియగు విదురుండును, ధర్మాచరణకల్యుండగు శల్యుండును నెయ్యది నిశ్చయించి పలికి రది యయ్యెడు. సుయోధనాదు లాయుష్మంతుల గుదురు గాక!' అని పలికెను." అని చెప్పిన విని మందాకినీనందనుం డందఱు విన దుర్యోధనున కిట్లనియె :

"నలినగర్భుం డొకప్పుడు పెద్దకొలువున నున్నెడ సురపతి ప్రముఖుల చూడ్కులు మెఱయు తేజమున మిఱుమిట్లుగొన నిద్ద

అచ్చట నొరసికొని యరుగఁ జూచి 'వీ రెవ్వరు ? ఇమ్మొయి మీరుండ సరకుసేయని యట్లు పోవుచున్నారు ?" అని బృహస్పతి బ్రహ్మ నడిగిన చతురాస్యుఁ డతని కిట్లనియె : "తపము పెంపును, బలశౌర్య దర్పములును గలిగి లోకహితార్థముగా నరనారాయణులను ప్రసిద్ధమును లన్నియుగములందును చరింతురు సుమీ. వా రనిమిషహితమును, దనుజనాశనమును జేయుదురు. అధర్మసంగ్రామము గల్గిన చోట ధర్మపక్షమును గెలిపింతురు. దేవాసురయుద్ధకాలమున నింద్రుఁడు వీరి నారాధించి తో డడిగినఁ జనుదెంచి పౌలోమి కాలకేయాదులగు ననేక దైత్యదానవులఁ జంపి యింద్రునకు విజయము గావించిరి. అదిమొదలుగా వీరల నెల్లరును నెఱిఁగియుందురు. ఇది యొక్క తేజము రెండు దెఱంగులై వెలుఁగుచుండును అని చెప్పెను. వినోదార్థము జన్మాంతరము నొందిన య మ్మహాత్ములు గదా యీ యర్జునుఁడును వాసుదేవుఁడును ! అర్జునుఁడు సముద్రతీరమున హిరణ్యపురము పొడిచి నివాతకవచులను నఱువదివేవుర నిర్జించి పర్జన్యునకుఁ బ్రియము చేసెను. వాసుదేవు పరాక్రమము కంసనరకాసుర ప్రముఖ నిఖిల దుష్టనిగ్రహమున బ్రసిద్ధమ కాదె? ఉన్నట్లు చెప్పెదను వినుము:

'ఆ యిరువురు నొక మొగమై యుద్ధమునకు వచ్చి రేని మనకే కాదు హరునకైనను నెదురై దాక శక్యమగునె? సారథియు రథియునై యొకతేరుననే కృష్ణార్జును లిర్వురును నతిఘోర తేజస్స్ఫారత దోఁచిన చూచిన నప్పుడు నీకుఁ దెలియును."

అనుచు నా సుయోధను నుపలక్షించి శాంతనవుఁడు మఱియు ట్లనియె :

"నా మాట కొంకింతయును బెదరవు. అకార్యమనిన నీకుఁ ప్రియము. కౌరవులకుఁ దుదికాలము వచ్చెనేమో ? లేనిచో నిట్టి ర్వృత్తుని నేమందును ? హితములగు నా మాట లిప్పుడు వినకపోతి నేని యప్పుడు 'వారు పడిరి, వీరు పడిరి' యను పలుకులు విందువు గాక ! శకుని కర్ణ దుశ్శాసను లప్పుడు సమ్మతింతురు. దుష్టకష్ట కృష్టాత్ములగు నిమ్మువ్వురుఁ జెప్పెడు బుద్ధులు గాని యెుండు విన వొల్లవు. ఏమి చేయవచ్చును ?" అని పలికినఁ గానీనుఁడు గనలి గాం గేయున కిట్లనియె :

"ఇట్టు లాడఁదగునె ? నే నేమిచేసితిని ? కొలిచి కుడిచి, పాడియు, నలవును, జలమును, నగు మాట లనుట యొగ్గగునె ? నేను పతికిని, పుత్త్రిలకును, మనుమలకును హితమగునట్లే వర్తింతును. అట్లు కానిచో నన్ను రారా జింతవానిగా నెంచుకు చేయును ! నిండు సభలో నిట్టి యన్యాయఁపు మాటలు నీ నోట వెడలనగునె ?"

అనిన విని భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లనియె :

"పాండవులలోఁ జిఱుతవారగు నకులసహదేవులలో నే యొక్కరి నైనను గర్ణుఁడు పోలఁడు. ఐనను సిగ్గులేక పాండవుల గెల్తునని కర్ణుడు పలుకుచుండును. వీని మాటలజ్జులును తులువలును విందురు. మగటి మిలో వారికి వీఁడు సరియని నమ్మి సుయోధనుఁడు విరోధముగాని

సర్వగుణాఢ్యులును, బలవంతులు నగు పాండవుల నవమానించెను. పాండవులలో నొకఁ డొకఁడే యనేక యుద్ధజయములు గొన్న వాడు. ఇతఁ డెకడ యేమిచేసెనో చెప్పడు. ఉత్తరగోగ్రహణకాలమున నీతని తమ్ముని గూలనేసి యుక్కెక్కిన పార్థుపైఁ గవియఁగ లైనే? పసులను గ్రమ్మరించుట కాతఁ డకడ లేకపోయెనే? ఘోషయాత్రలో భవదాత్మజుని గోల్పడఁడే?

'ఈ దురాత్ముఁడు కర్జం బెఱుంగక నీతిబాహ్యుఁడై వలసినట్లు ప్రేలరిమాట లాడుచుండును. నీవును గైకొని వినుచుందువు. మేల కాక!"

అనిన భీష్మపలుకులు విని ద్రోణుఁ డమ్మహారాజుతో నిట్లనియె:

"శాంతనవుఁడు సర్వకురుసంతతికిని గావలసినవాఁడు. ఇతని పలుకు లత్యంత హితములు. ఆహవముచేయు టొప్పదు. ధర్మసూతితోఁ బొంతనము మేలు. అర్జునుఁడు సంజయుతో నాడినవి యతిశయోక్తులు కావు. ఖాండవదాహమాది ఘనకార్యములు మీకుఁ దెలిసినవే.

"శరశరాసనములు లోకమున నెవ్వరు ధరింపరు? మగతనమున యుద్ధముల నెవ్వరు జయము గైకొనరు? కాని యర్జునుఁ డొకఁడే విజయుఁడని ప్రసిద్ధికెక్కెను.

"మన వీటన కాదు. అర్జునునకు సరియగు విలుకాఁడు లోకమున నెందును లేమి దెల్లము. అట్టివానిని దొడరనగునే?"

అని చెప్పి యప్పాటం బరమహితోపదేశముచేసిన భీష్మ ద్రోణుల పలుకు లాదరింపక, వారికి సదుత్తరము లీయక, వారితోం దదనురూపముగ సంభాషింపక, ధృతరాష్ట్రుండు వెండియుం బాండవులవలని వార్తలడుగుటకు సంజయుదిక్కు మొగమైనం జూచి కురుపక్షవీరు లందఱును బ్రాణములదెస నిరాశులై యుండ నమ్మహీపతి సంజయునితో నిట్లనియె :

"ధర్మపుత్రుం డిందలి విషయములను గుఱించి యేమి తలంచుచుండును ? ఇచ్చట సైన్యములెల్లం గూడియుండుట వినెనే ? ఎవ్వరిని గాని యతండు కౌరవులమీందికెత్తి రా గలండు.

అనిన విని సంజయుండు వెచ్చ నూర్చి ఱిచ్చవడి మూర్ఛపోయిన చందమున డెందము మగుడ చేష్టలు తక్కియుండి కొండొకసేపునకుం జిత్తమొక్కింతం జక్కచేసికొని "అక్కటా ! ఈభూపాలుం డింత బేల యగునే ? యుధిష్ఠిరుం డెవ్వరింగాని యెత్తివచ్చువాండని యడుగుచున్నవాండు ! ఇంత యెఱుంగని వాం డెంత చెప్పినను దెలియనేర్చునే ? ఇతని భంగి యిట్టిదనినం గొడుకుల తెఱంగు వేఱ యెన్ననేల ? నే నింక నేమనువాండను? ఐనను నన్నడిగిన మాటకుం దగిన మాఱుమాట పలుకవలయును కాదె ?" అని తలంచి ధృతరాష్ట్రున కిట్లనియె :

"రాజా ! వినుము. ధర్మజుండు సంధిం జేయ గోరును. మీరు సగము పాలియ్యకపోయినం గాని మీ కొక కీండు దలంపండు. భుజ

బలముననే రాజ్యము సాధింపఁదలఁచెనేని మీ బలమునెల్లను జీ
గొనఁడు.

"అతఁ డెవ్వరినిగొని యెత్తివచ్చువాఁడని యడిగితివి. నీ యోఁ
గనివారలం దెవ్వరు గలరు ? అవధరింపుము :

"బకవిధ్వంసియు, జటాసురాంతకుఁడును, హిడింబప్రాణాహా
హారిణుఁడును, కీచకనిర్మూలనకేళిలోలుఁడును నగు భీమ
ధర్మజుఁడు గొనివచ్చును.

'ఫాలాక్షుని నెక్కటి కయ్యమునఁ గన్న ఫల్గునుని భుజాగ
మును లెక్కింపుము. అంతటివానినిఁ గొని ధర్మసూతి సమరోత్సా
ముతో నెత్తివచ్చుటకుఁ గొంకునే ?

"ద్రౌపదేయులును, సుభద్రాసుతుఁడును నుకుటతునియలవఁ
వారు గారె ? ధర్మజుఁడు యుద్ధమున కుమారవరులను గొనివచ్చుఁ

"నృపా ! వృష్ణికుమారోత్తముఁడగు కృష్ణుని తమ్ముఁ
సాత్యకియు, దవదహనాత్యుష్ణప్రతాపదీప్తులగు కృష్ణాసోదరు
కేవలులె ?

"శౌర్యోజ్జ్వలుఁడగు పాంచాలభూనాథుఁడును, మహితవి
ముఁడగు మత్స్యవిభుఁడును, నతని తమ్ములును, సుతులును, ప్రతా
న్నతులగు కేకయపతులును, జరాసంధసూనుఁడును, సహదేవుఁడున
జయత్సేనవిభుఁడును, శిశుపాలతనయులగు ధృష్టకేతు వృషభులున
యదుభర్తయగు చేకితానుఁడును, దర్పఘనుఁడగు శైబ్యనృపాలుఁడు

గలరుగాదె ? భీమసేనసూనుఁడు ఘతోత్కచుఁడు దండ్రికంటెను లావును బీరమునుఁ గలవాఁడు. మాయాబలమున మనబలమెల్ల గలఁచును. మఱియునుఁ దూర్పున నుత్తరమునను గల నరనాయకులు నానాసేనాసమన్వితులయి వచ్చి చిచ్చయినను బిడికిలింత మనుచున్నారు. అదియునుఁ గాక ధర్మజునకు సకల భువనములు నఱచేతికిఁ దేజాలునట్టి ధీమంతుఁడు దేవకికొడుకు గలఁడు. ఇఁక ధర్మరాజెత్తిరాక నిలుచునె ?"

అని చెప్పిన సూతపుత్రునకు నంబికాపుత్రుఁ డిట్లనియె :

"నీవు చెప్పిన యీ రథికులెల్లరును ప్రబలులే కాని బలప్రమాణములందు వారెల్ల రొక తలయు, మారుతి యొక తలయు. భీముని దలఁచిన నా మనస్సు భీతిచే గలఁగును. రేలు నిద్ర రాదు. యుద్ధమున నతనిని మార్కొనువాఁ డీ మొన లేఁడు. అతఁ డలుకతో నెత్తిన గద కాలదండము. చిఱుతనాఁడును వాఁడు నా యాజ్ఞ ననుసరించినవాఁడు కాఁడు. వీరు వైరమెత్తి కలహించుచుందురు. పేదఁబడియును మానరు. ఈ భేదమున కెల్లఁ గారణ మదియ గాదె ? మదముకతన నెదిరినిఁ దమ్మును నెఱుఁగరుగాని ప్రళయకాలసముద్రుని భంగి పొంగు భీముని గడచుటకును, నాఁడుటకును నా పుత్రులకు వశమె ?

"భీమార్జునుల కొలఁదులు భీష్మద్రోణులకంటె నెవ్వ రెఱుఁగుదురు ? ఎఱిఁగియు మానుషము వాటించి సేనమొగమున నిలుతురు.

కీర్తికొఱకై ప్రాణములు విడుతురు—ఇంతియ కాని చేయునది లేదు. అదియునుఁ గాక పౌత్రులగుటయు శిష్యులగుటయు గాంగేయునకును గురునకును సామాన్యంబగుటఁజేసి రెం... తెఱఁగుల వారికి వీ రొక రూప. మనకడ నున్న తప్పునకు మన ముందట నిలువవలయు నను నింత మాత్రకుఁగా వీరల కింత వలసె. నేను దైవాధీనత కతమున బిడ్డల నోర్తిచెప్పను. నియమింపను జాలను. మొదల విదురుఁడు చెప్పినట్లు వాటిల్లెను. జూదము నాఁటనుండియుఁ గురుజాతికిఁ జేటు మూఁడుట దోఁచుచుండును. మందబుద్ధియు, లోభోపహతుఁడును నయి దురభిలాషమున దుర్యోధనుఁ డింతచేసె. కాలవిపర్యయమునఁ గౌరవులకుఁ గడవరాని యవస్థ వచ్చెను—సంజయా! నేనేమి చేయుదును? ఎందుఁజొత్తును? ఎద్ది తెఱువు? ఎవ్వరు శరణము?

"కావున పాండవులతోడి భండనమునఁ గులక్షయమగుట తప్పదు. శాంతిఁ బొందుటయ మేలు. మనవారల కది ప్రియంబగు నేని దానికిఁ దగిన యత్నము చేసెదను."

అనిన విని ధృతరాష్ట్రునకు సంజయు డిట్లనియె:

"దేవర యానతి యిచ్చిన యీ మాట కడు లెస్స. నాఁడు నీ వుపేక్షించి పోవిడిచితివి. ఇప్పుడైనను మించినది లేదు. పాండవులు నీ చేతికి వత్తురు. వారు కౌరవుల చేటున కొప్పుదురే? వారు దిగ్విజయ మొనర్చియు ధరారాజ్యమును మీ కిచ్చి పోలేదే? అరణ్యవాసాయాసముఁ బడియు రారాజును చెఱనుండి విడిపింప లేదే? అట్టి

యెడ నైనను రావించి తగవ్రమై సంభావింప వైతివి కాని నాఁడే పాండవు లలుక విడువరే? వారు నీ మాటకు మిగులుదురే? ఇప్పుడై నను వారినిఁ బిలిచి వారి భాగమును వారి కిమ్ము."

అనిన విని దుర్యోధనుఁడు దండ్రి కిట్లనియె:

దుర్యోధనుని మాటలు

"అడవులను గొండలను బడి మహాపద లొంది శౌర్యమును గోల్పడి యున్న వారినిఁ గొనివచ్చి కృష్ణుఁ డొకప్రోవుగ గూటువమూఁకను గూర్చినంత మాత్రమునఁ బాండవులు సంగర మొనర్తురా? రాజా! యెందుల కింత భీతి? మా కడిమియు లావును నీ వసనుగా గణుతింపకుము. ఎమ్మెయినైనను మేమే గెల్తుము.

"పరశురాముని గెలిచిన బల్లిదుఁడు భీష్ముఁడు. ఇతని పేరు విని యవనీశులు పాఱుచుందురు నీవెఱుఁగవే? ఇతఁ డలిగెనేని పాండుపుత్త్రులన నెంత? కృపుఁడును గురుఁడును నయోనిజులు; అపరిమిత భుజాబలాఢ్యులు. ఆహవకేళీ నిపుణులు; అజేయులు. వీరలు కుపితాత్ములైన హరుఁడైనను వీరిని మార్కొనునే?

"ఈశ్వరవర జనితుఁడును, హరిదశ్వ ప్రతిమాన తేజుఁడును, నస్త్ర కళానిత్యైశ్వర్యధురంధరుఁడును నగు నశ్వత్థామ గలుగ మనకు యుద్ధమున వెఱపేల?

"సహజ కుండలుఁడును, శౌర్యధుర్యుఁడును, సమదీర్ఘబాహు

బలుఁడును నగు కర్ణుఁడు మా పక్షమున నున్నాఁడు. ధర్మజుపక్షమున నితనికి సమాను నొకని చూపుము.

"నరేంద్రా! కర్ణుని పెంపు వినుము. మహేంద్రుఁడు వచ్చి శచికై తన్నర్థింప గుండలముల నితఁ డిచ్చుట లోకవిశ్రుతము కాదె?

"ఇట్లు మన పక్షపు వీరులు ధర్మపుత్త్రాదులకే కాదు—ఎవ్వరి కిని నజేయులగుట దెల్లము. బాహ్లిక, సోమదత్త, భూరిశ్రవ, శల్య, సింధురాజ, గాంధారరాజ ప్రభృతి మహావీరులు వారలకంటె శక్తి సమగ్రులు. తక్కటి రాజలోకమును, సహాయులై వచ్చిన వివిధ దేశాధీశులును నాతోడి సుఖదుఃఖముల కియ్యకొని, యగ్గలికమై నగ్నినైన నుఱుకను, సముద్రంబైన నీఁదనుఁ దెంపుచేసి పొంపిరిపోవు చున్నవారు—కావునఁ బాండవులకు మాదెస దేఱిచూడనుఁ గొలఁది గాదు. అనుమానింపకుము. ఇట్లుఁ గాక నిట నెవ్వరును లేక, చుట్ట ముఱును జెలులును విడిచి, తోడువచ్చినవారును విచ్చిపోయి, భృత్యులును విరక్తులై యుంట మాకును, నట పోటుమానిసులును, బంధు మిత్త్ర సహాయులును, ప్రజానురాగమును గలుగుట వారికిని నైన నది ప్రాప్తకాలము. ఇంతియ కాని మే మింక వారి యడుగు లొత్తనుఁ బాఱిపోవనుఁ జాలము. ఎల్లభంగుల సమరము సేయు దుము. తలపెట్టిన నా తలఁచిన ట్లొండె, వాసుదేవుఁడు దలఁచిన ట్లొండె నయ్యెడు—ఎట్లైనను మేలె. ఇది నిర్ణయము."

అని పలికి, మఱియు నిట్లనియె:

"కులములోఁ దలవంపగు కూడు గుడువఁ బంపఁ జూచెదవు. పగతురు పైనెత్తి వచ్చిన 'పోరికి నోపము' అని చెప్పుట పిఱికితనము గాని పొందుగాదు.

"నీవు కొడుకుల చావునకును జేటునకును భయపడి, యీ విధమున వావిడిచి యఱచిన జను లేవపడరె? ని న్నేమందును?

"భీమసేనుని నీ వింత పెద్దచేసి పెక్కుభంగులఁ జెప్పితివి. 'అతఁడు బలవంతుఁడు; గదయందు నేర్పరి' అని యెంతయు బెదరెదవు. నరవరేణ్యా! అతఁడు నన్నుఁ బోలమి యెఱుఁగవే? గదాయుద్ధమున నాతో సరి యిమ్మూఁడు లోకములందును లేఁడు. చలమెత్తి యున్మ దుఁడై భీముఁడు నన్ను యుద్ధమున నెదుర్కొనినచో వజ్రప్రహారముచే గూలు పర్వతమువలె భూమినిఁ గూలఁద్రోసెదను. పెద్దకాలమునకు గదారణము వచ్చెను. నా కోరిక యీడేరెను. భీముఁడు పడిన తర్వాత పాండవసేనల నడిపించువాఁ డొక్కఁడును లేకపోవుట సిద్ధము. ఇది యంతయు నెఱిఁగి వెఱచికాదె 'ఐదూళ్లైనను దమకుఁ జాలును' అని ధర్మనందనుఁ డడిగెను.

"అర్జునుఁ డున్నాఁడని తలఁచితివేమో. కర్ణుని శక్తిముందఱ నిలిచి నరునకు బ్రతుకవచ్చునె? అదియుఁ గాక యతనిని భీష్మాది రథికుల యతులితమగు దివ్యబాణములు ద్రుంగికొనవె?

"దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదు లగు నీ కొడుకు లొక్కండొక్కండ జగముల్లెల్ల జయింపఁజాలుదురు.

అందఱు నొక్కమొగమై త్రోచి నడచిన సవ్యసాచికి నొక్కని నెగాదు. పాండవుల నెల్ల నొక్కెత్తున వైచికొన నోపుదురు. అట్లునుఁగాక మా బలములు పదునొక్క యక్షౌహిణులు. వారి బలము లేడక్షౌహిణులు మాత్రము. మా సైన్యము సారవంతము. వారి బలము నిస్సారము. వారు మ మ్మెవ్విధమున జయింప నోపుదురు ? ఈ యెక్కువదక్కువలు విచారింపక వలవని వెఱపు గట్టికొని ముకర్ణారి వగచుచున్న వాఁడవు. నిన్ను వగవకుండ నుడుపఁజాలము. అంతియ కాని తక్కిన పనులకు జాలుదుము.” అని పలికి, సంజయుదెసఁ గనుఁగొని సుయోధనుఁ డిట్లనియె :

“అ య్యమసూనుఁడు సమత్సరబుద్ధితో నానాదేశముల పెద్ద మనుష్యులను గూర్చికొని యేమ నెనో చెప్పుము; చూతము.”

అనిన విని సంజయుఁ డిట్లనియె :

“ధర్మజుఁడు భండనమనిన సంతసమున మూరెడు పెరుగును. అతని తమ్ములును పెండ్లికి పోవుచున్నవారివలె నున్నారు. అందలి నాయకులు తమ భుజకండూతి యెప్పుడు వదలునా యని యాతురత పడుచున్నారు. నరుని పాశుపతాది బాణముల పెంపును, భీముని గదాకౌశలమును నమ్మి యక్కడి బలము భయముడిగి కయ్యమునకుఁ గాలుఁ ద్రవ్వుచున్నారు.”

అనఁగా దుర్యోధనుఁడు :

“సంజయా ! నీవు కౌంతేయుల కై వారము చేసెదవు. వా

రేయే రణసాధనములు గైకొని కౌరవులపై వెఱవక పైకొన జూచు చున్నారు ?”

అనిన సుయోధనునకు సూతనందనుఁ డర్జును దివ్యరథ శ్వేతాశ్వ కపిధ్వజ దేవదత్తముల మహానుభావములు వేఱువేఱ వర్ణించి చెప్పి, యుధిష్ఠిర భీమ నకుల సహదేవుల యరదములు, తురంగాది పరికరము లిట్టిట్టివని యేర్పడఁ బలికి, విరాట ద్రుపదాదు లకు వలయు నుపకరణములు కొఱఁత లేమియు నెఱిఁగించిన,— ధృతరాష్ట్రుఁడు, “ఇందుఁ గల బలుమానుసు లెవ్వారికి నసాధ్యులు. వీరి సాధించు తెఱఁ గూహించిరే ?” అని యడిగిన నతనికి సంజయుఁ డి ట్లనియె :

“గంగాసుతుఁడు శిఖండిపా లనియు, నతనికి మత్స్యేశ్వరు బలము ప్రాపనియు, ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుపాలనియు నతనికిఁ దోడు ద్రౌపదేయులనియు, రారాజును నతని తమ్ములును మారుతి పాలనియు, కుమారు లభిమన్యు పాలనియు, శకుని సైంధవులును, నశ్వత్థామ కర్ణులును సవ్యసాచి పాలనియు, కృతవర్మ సాత్యకి పాలనియు, సోమదత్తుఁడు చేకితానుని పాలనియు నచ్చట నిశ్చయిం చుకొనిరి. నకుల సహదేవులు నులూకాది సుతులను, సార స్వతులను, కాళింగకులను శమయింతురట. ధర్మరాజు శల్యుని గెలు చునట.

“అట్టి పలుకుల సమయమున నచ్చటి జనులు కొందరు ధర్మ నందను నుద్దేశించి :

'ఇతఁ డెక్కడ? శల్యుఁ డెక్కడ? ఇతని కతఁడు పాటియె?' అనిరి. దానికి నేను శల్యుని యతి బల శౌర్యములు వారికిఁ జెప్పితిని.

"ఇంతయ కాక యుద్ధమున నెవ్వ రెవ్వరి కెదురు పడినను వారితో వారు జోర నిశ్చయించుకొనిరి. ఇంక నీ కొడుకులకును నీకును నెయ్యది కర్జంబని తోఁచిన నది చేయుఁడు."

అనిన విచిత్రవీర్యతనయుఁ డిట్లనియె :

నా కొడుకుల కిం కెక్కడి బ్రతుకు? యుధిష్ఠిరుఁడు రాజై హరి యతనికి జయ మొసఁగూర్ప నుండిన, నవ్వారి సైన్యమును రారా జీవిధముగ సరకుసేయకుండుట నా జన్మము దుఃఖభాజనమగు టయే సుమీ! ఇక్కడ కూడిన భూపతుల కిది యంత్యకాలము దాపురించినది. నాకు వీరిని మాన్పుట కేల సాధ్యమగును? నీ కీ వగ పేల? ఇంక మాటలు నిలుపుము."

అనిన విని దుర్యోధనుఁడు నిజజనకునితో నిట్లనియె :

"మేమును బాండునందనులును నేకకులమునఁ బుట్టి యొక్క చోటనే వర్తించిన వారము. అట్టియెడ శౌర్యబలదర్పములు వారికే కల్గి వారే సంగ్రామమున జయింతు రన్న నిశ్చయ మెట్లు గల్గెను?

"పాండవులను, వారి వారిని నిట్లు వర్ణన చేయుదువు గాని మమ్మును మా వారిని దలఁపవు. మేము రాజ్యము చేయుటయు,

వారు రాజ్యభ్రష్టులగుటయు విధి నిర్ణీతము. దీని నెవ్వారును మాన్ప జాలరు. అకారణముగ దుఃఖించు టేల ?"

అనిన విని సూతనందనునకు నంబికానందనుఁడిట్లను : "నా కొడుకున్మత్తప్రలాపములు చేయుచున్నవాఁడు. ఇంతియ కాని సత్య ధర్మ నయ పరాక్రమ సహాయ సంపన్నులైన పాండవులను గెలువ సాధ్యమే ? తాను ప్రబలుఁడయినను యుద్ధము కీడెకాక మేలగునే ? అది యట్లుండె. ఒకకొటి యడిగెదను చెప్పుము.

"సంజయా ! సమరమునకుఁ బురికొల్పుచు, మమ్ముదలఁచి నంతనె యుల్లికులిక్కట్టు మాటలచే వారి చిత్తము లుడికించుచు పాండవులను యుద్ధసన్నద్ధులను గావించుచున్నవా రెవరో సుమా ?"

అనిన సంజయుఁ డిట్లను :

"దేవా ! పాండవుల యలుకను ధృష్టద్యుమ్నుఁ డే వెరవుమాటనైనను నేయిపోసిన భగ్గుమనునట్లు నిగుడఁజేయును. అతఁడు ధర్మ తనయుతో : 'గాంగేయ కుంభసంభవాది మహావీర క్రూర సత్త్వ బహుళమును, కరిఘటా గిరికదంబ కలితమును, తురంగనికర తరంగపరంపరా ఘోరమును నగు కౌరవసేనా సముద్రమునకు నే నొక చెలియలికట్టనై నిలిచెదను.' అనగా యుధిష్ఠిరుఁడు 'నీ వింతకుఁ జాలుట యెవ్వ రెఱుఁగరు ? ఎట్లును సంగరమున మ మ్ముద్ధరింపుము." అనియె. ఇట్లు గొనియాడిన నాతఁడు నాదెస గనుఁగొని : 'సంజయా! మీ వారలకెల్లనుఁ దెలియఁ జెప్పుము. ఈశ్వరాది దేవ

తలు కూర్చిన సవరణ గల యర్జునుచేత నిర్జింపఁబడిన యుత్కృష్ట జాతు లనేకు లుండుట యెఱుఁగుదురుకదా ? మనుష్యు లతని కెంత పెద్దా ? ఇట్టి జెట్టి వెన్నుదన్ని చూడఁగలవాఁడు గావున మముబోంట్లుల్లఁ బోక పెనఁగినచోఁ బోరు భారంబగు. తర్వాత బ్రాణములపై వచ్చు. అంతకంటెను బరమదయాపరుఁడైన పాండవాగ్రజు మాఱువు చొచ్చి బ్రదుకుఁ డనుము. అంతలంతలు దప్పులు చేసితిమని తలంక వలవదు. ఎంత చేసినను కౌంతేయపూర్వజుఁడు శాంతిసుధానిధి యగుటఁ జేసి, శరణు జొచ్చిన గాచును' అని పలికెను"

ధృతరాష్ట్రు వచనములు

అనిన విని ధృతరాష్ట్రుఁడు దుర్యోధనున కిట్లనియె :
"నీకును పరిజనులకును సగము రాజ్యము చాలును. తక్కటి సగమును పాండవులకిచ్చి నిశ్చింతతోఁ బ్రదుకుము.

"యుద్ధము నాకె కాదు. మన పెద్దల కెవ్వరికిని నియ్యకోలు గాదు. యుద్ధ మనుచిత మగుటచే గురుడాది బంధుమిత్రులు పోరి కియ్యకొనరు. ధర్మపుత్త్రుఁ డకుంఠితతేజుఁడు. ఆతనితోఁగూడి బ్రతుకుట కౌరవజాతి కంతటికినిఁ గౌరవప్రదము. కర్ణుఁడు రేఁచి పెట్టఁగ, దుర్ణయపరులైన శకుని దుశ్శాసను లీ నిర్ణయమే మేలనఁగ నీ కర్ణముల కీ మాటలెట్లు రుచించును ?"

సుయోధనుని నిశ్చయము

అనినఁ గటకటంబడి సుయోధనుఁ డిట్లనియె :
"నీవు చెప్పెడి పెద్దలు ద్రోణాచార్యులు మొదలైనవారు యుద్ధమున కొల్లని శక్తిహీనులైనచో వారిని గొనియా నేను పాండవుల నెదుర్కొనునది. రాధేయుఁడును దుస్స

